ఈ సంపుటిలో:



—...—

# రవ్వంత నిప్పు - ఇల్లంతా కాలుస్తుంది!

ఒక ఊళ్ళో ఇవాన్ షెర్బకోవ్ అనే ఒక రైతు వున్నాడు. అతనికి ముగ్గురు కొడుకులు. పెద్దవాడికి పెళ్ళి అయిపోయి, భార్యకూడా కాపరానికి వచ్చింది. రెండోవాడికి పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి. కాని ఇంకా చేయలేదు. మూడోవాడు చిన్నవాడు. ఇప్పుడిప్పుడే గుర్రాలను పొలం తోలుకుపోతూ, వ్యవసాయపు పనులు నేర్చుకుంటున్నాడు.

ఇవాన్ భార్య తెలివిగల ఇల్లాలు. సంసారం చక్కగా జరుపుకుంటూ వస్తోంది. కోడలుకూడా మంచిదే దొరికింది. శాంతం కల పిల్ల. వళ్ళొంచి పనిచేసే మనిషి.

ఇవాన్‌కు కాస్త వయసువచ్చినా, మంచి బలంగా, పుష్టిగా వుంటాడు. ఎంత చాకిరీఅయినా శ్రమ అనుకోకుండా చేసే శక్తి వుంది. పోతే ఇవాన్‌కు ముసలి తండ్రి ఇంకా బ్రతికే వున్నాడు. ఆ ముసలాడికి ఏడేండ్లబట్టీ, ఉబ్బసవ్యాధి పట్టుకుని పీడిస్తోంది. మంచంలోంచి లేవడంలేదు. అశక్తుడైన తండ్రిని ఇవాన్ పోషిస్తున్నాడు. అతని జరుగుబాటుకు ఏలోటూలేదు. తినా కుడవా వుంది. పొలం వుంది. ఇంట్లో గొడ్డూ, గోదా వున్నాయి. నాలుగు గుర్రాలు, ఒక ఆవూ, దూడా, పదిహేను గొర్రెలు, ఇవి అతని పశు సంపద. పొలాల్లో కష్టపడి పనిచేసి, పంట పండించుకుంటున్నారు. ధాన్యం సమృద్ధిగా వస్తుంది. ఈ ఏటి గింజలు ముందటేడుదాకా అట్టేపెట్టుకుంటారు. ఆ విధంగా ఎప్పుడూ పాతధాన్యం తినడమే వాళ్ళకు అలవాటు. కొద్దిపాటి

ధాన్యం అమ్మి భూమి శిస్తు చెల్లిస్తారు. మిగతాది అంతా నిలవే. ఇక తే ఆడవాళ్ళుకూడా ఇంట్లో పనులన్నీ చేసుకుంటారు. గుడ్డలు కుట్టుకోవడం, చెప్పులు బాగుచేసుకోవడం, అన్నీ స్వయంగా చేసుకుంటారు.

అలా ఇవాన్ కుటుంబం, చీకూ చింతా లేకుండా సుఖంగా కాలక్షేపం చేస్తోంది. కాని ఒకటిమాత్రం జరిగింది. పొరుగున వున్న గేబ్రియల్ కుటుంబానికీ ఇవాన్ కుటుంబానికీ బద్ధవైరం. ఆ ఇంటిమీద కాకి ఈ ఇంటిమీద వాలదు.

పూర్వం బాగానే వుండేది. ఇవాన్ తండ్రీ, గేబ్రియల్ తండ్రీ ప్రాణస్నేహితులు. రెండిళ్ళకూ కంచె అడ్డం. పొలం పనులలో ఒకరికొకరు సహాయపడుతూ, అవసరమొచ్చినప్పుడు ఒకరికొకరు పనిముట్లు సప్లయిలు చేసుకుంటూ, ఎంతో ఒద్దికతో వుండేవాళ్ళు. ఇళ్ళల్లో ఆడవాళ్ళుకూడా తోబుట్టువులకు మల్లే, మనసారా మాట్లాడుకునేవాళ్ళు. కూరా నారా ఆఇంటి నుంచి ఈఇంటికి, ఈఇంటినుంచి ఆఇంటికీ నడుస్తూవుండేవి. ఒక్కోసారి వీళ్ళ పశువులు వెళ్ళి వాళ్ళచేలల్లోనూ, వాళ్ళ పశువులు వచ్చి వీళ్ళ పొలాల్లోనూ పడడంకద్దు. అయినా తగువుపెట్టుకోవడంగాని, పశువులను చావగొట్టడం కాని వుండేదికాదు. ఇలా జరిగిందని ఒకరితో ఒకరు చెప్పుకుని ముందు జాగ్రత్తలు తీసుకునేవాళ్ళు.

ఇదంతా వెనకటి విషయం. తరువాత ముసలివాళ్ళ పెత్తనంపోయి కొడుకుల హయాం వచ్చింది. దాంతో పుట్టుకొచ్చాయి ఈ కలహాలు.

ఇవాన్ కోడలు ఒక కోడిపెట్టను పెంచుతోంది. అది గుడ్లుపెట్టడం మొదలెట్టింది. గాదెల చాటున, రోజూ ఒక గుడ్డు కనిపించేది. కాని ఓరోజున ఏపిల్లలైనా దాన్ని వెంటపడి తరిమారో ఏమో, అది కంచెమీదనుంచి ఎగిరి పొరుగునవున్న గేబ్రియల్ దొడ్లో గుడ్డు పెట్టింది. అవి ఈస్టరు పండుగరోజులు. ఇవాన్ కోడలు ఇంటి పనులలో నిమగ్నురాలైవుంది. అంతలో ఆమెకు అవతల్నుండి కోడిపెట్ట అరవడం వినిపించింది. అయినా పని తొందర్లోవుంటంచేత వెళ్ళలేదు. తర్వాత వెళ్ళి గుడ్డు తెచ్చుకోవచ్చుననుకుంది. చేతులో పని అయింతరువాత వెళ్ళి చూచింది. కాని కోడి మామూలుగా గుడ్లుపెట్టేచోట ఏమీ అగుపించలేదు. గుడ్డు ఏమైందా అని ఇల్లంతా వెదికింది. ఊహు. తరువాత ఇంట్లో అందర్నీ అడిగింది. అత్త, మామ, మొగుడు, మరిది, అంతా మేం ఎరగం అంటే, మేం ఎరగం అన్నారు. అంతలో చిన్నమరిది తారాస్, కోడిపెట్ట పక్క వాళ్ళ దొడ్లోంచి అరుస్తోంటే తాను విన్నానని వదినెతో చెప్పాడు. ఆ తరువాత అది తిరిగి మన దొడ్లోకి ఎగిరి వచ్చిం దనికూడా చెప్పాడు. అది విని ఆమె కోడిపెట్ట దగ్గరకు వెళ్ళి చూచింది. నీళ్ళపోసే తొట్టె దగ్గర, నిద్రమత్తుగా వున్నట్టు కళ్ళుమూస్తూ తెరుస్తూ కూచునివుంది కోడిపెట్ట. మరి గుడ్డుమాటో? చివరకామె గుడ్డు సంగతి ఏమిటో కనుక్కుందామని పొరుగింటి కెళ్ళింది.

అంతలో లోపల్నుంచి ముసలమ్మ బయటి కొచ్చింది.

'ఏం అమ్మాయ్! ఇట్లా వచ్చావ్?'

'ఏం లేదు ఇవాళ పొద్దున మా కోడిపెట్ట మీ పెరట్లోకి ఎగిరి వచ్చింది. ఎక్కడైనా గుడ్డు పెట్టిందేమో చూద్దామని వచ్చా' అని జవాబు చెప్పింది ఇవాన్ కోడలు.

అది విని ముసలమ్మ మొహం చిట్లించుకుంది.

'దాన్ని అసలు మేం చూడనేలేదే! దేవుడి చలువవల్ల మా పెట్టలు సమృద్ధిగా గుడ్లుపెడుతున్నాయి. అయినా పరాయివాళ్ళ గుడ్లకు ఆశపడాల్సిన అవసరం మా కేంవుంది? కాని దానికోసం కక్కుర్తిపడేగతి పట్టలేదు మాకింకా.' అంది ముసలమ్మ, ఎత్తిపొడుపుగా.

ఆ ముసలమ్మమాటలు, ఆమె చెవులకు ములుకుల్లా సోకాయి. సహించలేకపోయింది. వెంటనే తనుకూడా పెళుసుగా సమాధానం చెప్పింది. అది విని మళ్ళీ ముసల్ది అహంకారం చూపిస్తూ ఏదో అంది. ఇంకేముంది? లడాయిపడింది. ఇద్దరూ తిట్లకు లేచారు. ఇంతలో నీళ్ళు పట్టుకుంటోన్న ఇవాన్ భార్యకు ఈ అరుపులు వినిపించాయి. వెంటనే ఆమెకూడా చరచరా అక్కడికొచ్చి కోడలకు వత్తాసిగా నిలబడింది. అటునుంచి గేబ్రియల్ భార్యకూడా వచ్చింది. ఒకరిమీద ఒకరు విరుచుకపడ్డారు. ఉన్నవీ లేనివీ, పాత సంగతులన్నీ తవ్వుకుంటున్నారు. గొళ్ళు పెద్దవయినాయి. రెట్టించుకుంటున్నారు. ఆడాళ్ళ అఘాయిత్యం అంతా వెళ్ళ గక్కుతున్నారు. ఈ మాట అనవచ్చా, అనకూడదా అనే విచక్షణలేకుండా, నోటికి వచ్చినట్లు అడ్డమైన మాటలు అనుకుంటున్నారు. ఎవరిగొంతూ తగ్గేట్టు లేదు.

'నీవే రండవు, ముండవు! రంకులాడివి, బొంకులాడివి! చిల్లుపడ్డ నూనె చేబదులని తీసుకెళ్ళి తిరిగి ఇచ్చావా? నీ బతుకు

నా దగ్గర శే ! ముసలాడికి తిండి పెట్టకుండా పడిపించడంలేదూ ! ఓసి! నీ నోరు పడిపోను. మా ఇంట్లో వస్తువులన్నీ తీసుకపోయి మళ్ళీ ఇచ్చావు శే! నీ తలప(డు పగలా !

ఇలాగా ఒకరినొకరు తిట్టుకుంటుంన్నారు. అంతలో ఎవరో లోపల్నించి ఒక దుడ్డుకర్ర తెచ్చారు. ఆకర్రతో అటూ ఇటూ పెనగులాడుతూ తన్నుకోవడం మొదలెట్టారు. జుట్లు జుట్లు పట్టుకున్నారు. గోళ్ళతో రక్కుకుంటున్నారు. గుడ్డలు చింపుకుంటున్నారు. అంతలో పొలంనుంచి వస్తున్న గేబ్రియల్ ఇదంతా గమనించాడు. ఒక్క పరుగులోవచ్చి భార్యకు సహాయంగా నిలబడ్డాడు. అది చూచి ఇటు ఇవాన్, అతని కొడుకులూ, రంగంలోకి దూకారు. అంతేమరి? కలహం అంటే ఏముంది ? పెంచినకొద్దీ పెరుగుతుంది. మగాళ్ళు, ఆడాళ్ళుకూడా వీరంగాలు వేసుకుంటూ రణరంగంలో దూకారు. ఇవాన్, అందరిలోకీ బలంకలవాడవడంవల్ల అతనిదే పైచేయి అయింది. అందర్నీ అటూ ఇటూ తోసి, గేబ్రియల్ గడ్డం పట్టుకుని పీకేశాడు. అప్పటికి చాలమంది జనం పోగయి ఎంతో కష్టంమీద వాళ్ళను అటూ ఇటూ సర్దుబాటుచేశారు.

ఈ కోడిగుడ్డు మూలంగా వచ్చిన కలహమే, రెండు కుటుంబాలమధ్య ద్వేషాన్ని పుట్టించింది

ఆతరువాత గేబ్రియల్, పట్నం వెళ్ళి, ఇవాన్ తనను కొట్టాడనీ, గడ్డంపీకాడనీ, క్రిమినల్ కోర్టులో చార్జీ పెట్టాడు. దృష్టాంతరంగా, ఊడిపోయిన గడ్డపు వెంట్రుకలుకూడా ఒక కాగితంలో పొట్లం కట్టి దాఖలు చేసుకున్నాడు.

గేబ్రియల్ భార్య అందరితోనూ అనడం మొదలెట్టింది.

'ఇవాన్‌గాణ్ణి ఏంచేయిస్తానో చూడండి. శిక్ష వేయించి సైబీరియా పంపకపోతే నన్ని పేరుతో పిలవకండి,' గేబ్రియల్ కూడా 'ఈ దుర్మార్గుడికి తగిన ప్రాయిశ్చిత్తం చేయిస్తాను.' అంటూ రంకెలు వేస్తున్నాడు. దాంతో ఇవాన్ వాళ్ళుకూడా రెచ్చిపోయి ఏదో అనడం, ఈ విధంగా రోజురోజుకు ద్వేషం ముదిరిపోవడం జరిగింది.

ఇవాన్ తండ్రి, అనేకసార్లు కొడుకునూ, కోడలునూ హెచ్చరించాడు. కలహంవల్ల అనేక కష్టాలు వస్తాయనీ, జరిగింది మరిచిపోయి అన్యోన్యంగా ఉండండనీ, నీతులు బోధించాడు. ఊహూం. ముసలాడి మాటలు ఎవరి చెవికీ ఎక్కలేదు. 'అబ్బాయీ! ఇదేం బాగాలేదు. ముష్టి కోడిగుడ్డుకోసం ఇంత కలహం పెంచుకుంటారట్రా! నిజంగా వాళ్ళే ఎవరో గుడ్డు దొంగిలించారే అనుకో, వాళ్ళ పాపం, వాళ్ళకే కొడుతుంది. దీనికింత రాద్ధాంతం ఎందుకు? మనకు భగవంతుడు కావల్సినంత ఇచ్చాడు. వాళ్ళే ముందు తిట్టారనుకో. మరి నీలో మాత్రం మంచి ఏముంది? నీవూ మాటకుమాట అన్నావు. చివరకు అందరూ కొట్టుకున్నారు. అయినా మించిపోయిందిలేదు. ఇలాంటి పొరపాట్లు జీవితంలో వస్తూనేవుంటాయి. వాటిని సర్దుబాటు చేసుకోవడంలోనేవుంది - మన గొప్పదనం. గేబ్రియల్ దగ్గరకువెళ్ళి క్షమాపణ వేడుకో. జరిగింది మరిచిపొమ్మని చెప్పు. లేకపోతే ఇద్దరూ చెడిపోతారు' అంటూ ముసలాడు వాపోయాడు.

కాని మదమెక్కిన కుర్రాళ్ళెవరూ అతని మాటలు లక్ష్యపెట్టలేదు.

'నేను గేబ్రియల్‌ను కొట్టలేదు. వాడి గడ్డం పీకలేదు, వాడే ఆ పని చేసుకుని నామీద కేసు పెట్టాడు. పైగా వాడి తోడుకు నా చొక్కా చింపాడు. అబద్ధమేమో చూడండి.'

అంటూ ఇవాన్ అందరికీ తన చొక్కా చూపించాడు.

తరువాత తనుకూడా గేబ్రియల్ మీద కోర్టులో కేసు పెట్టాడు ఇవాన్.

అలావుండగా ఒకనాడు గేబ్రియల్, బండి శాయిలు ఎవరో ఎత్తుకపోయారు. ఆపని ఇవాన్ కొడుకు చేశాడని అనుమానపడ్డారు. 'నిన్న రాత్రి మా గోడ పక్కనుంచి బండి దగ్గరికి వెళుతుంటే మేం చూశాం' అని సాక్ష్యం చెప్పారు ఎదురింటి వాళ్ళు. ఆ శాయిలు ఊళ్ళో సారాకొట్టుదగ్గర అమ్ముతుంటే చూశామని మరొకరన్నారు. ఇంకేం? మరోకేసు.

తన బండి శాయిలు ఇవాన్ కొడుకు దొంగిలించుక పోయాడని, గేబ్రియల్ మళ్ళీ చోరీ కేసు పెట్టాడు.

నిత్యం ఆ ఇంటివాళ్ళు, ఈ యింటివాళ్ళు, ఏదో వంక పెట్టుకుని, కొట్టుకోవడమో, తిట్టుకోవడమో చేస్తున్నారు. పొలాలకు పోయినప్పుడు మగాళ్ళు తగువుపెట్టు కుంటున్నారు. ఇటు నీళ్ళకు పోయినప్పుడు, బట్ట లుతుకునేటప్పుడు ఆడాళ్ళు తిట్టుకుంటున్నారు. చివరకు పెద్దవాళ్ళనుచూచి పిల్లలుకూడా నేర్చుకున్నారు. ఆటలాడుకోడం మాని తన్నుకోవడం మొదలెట్టారు.

మొదట్లో ఒకరిమీద ఒకరికి వుండే ద్వేషం కొద్దీ, అబద్ధాలు కల్పించుకోడం, అభాండాలు వేసుకోడం చీటికి మాటికి ఏదో వంకలు పెట్టుకుని తన్నుకోడం జరిగింది. కాని

క్రమక్రమంగా అబాద్ధాలుపోయి నిబద్ధాలయ్యాయి. అభాండాలుపోయి బ్రహ్మాండాలయ్యాయి. నిజంగా ఒకరి వస్తువులు ఒకరు దొంగిలించడం మొదలెట్టారు. వీరి చేలల్లో ధాన్యంవారు కాజేయడం; వారి పెరట్లో వస్తువులు వీళ్ళు దొంగిలించడం జరిగింది. పిల్లలకూడా అవే బుద్ధులు పట్టుపడ్డాయి. నీళ్ళు నీళ్ళ వంకన పారతాయిగాని మిట్టలెక్కి పారతాయా! పెద్ద వాళ్ళే ఈ బుద్ధులు నేర్పారు వాళ్ళకు.

ప్రతి చిన్నవిషయానికీ, ఊళ్ళో పెద్దమనుషుల దగ్గరికి పోవడం; అక్కడ పంచాయితీలు, షష్టాయితీలు జరగడం, ఎవర్నో ఒకర్ని చీవాట్లు పెట్టడం, ఇవన్నీ మామూలయి పోయాయి. అలాగే కోర్టు వ్యవహారాలుకూడా. కేసులకు సందులేదు. ఇరుకుటుంబాలవారు, కోర్టు పనులమీద సందు లేకుండా ఊరికీ, పట్నానికీ తిరుగుతుండేవారు. చివరకు జడ్జీలకూడా విసుకుపుట్టింది. 'ఏమిటి పాడుపీడ? ఎప్పుడూ ఏవో కేసులు బనాయించుకోడమేనా పని? ఇందులో ఏది నిజం, ఏది అబద్ధం? ఎవరిది న్యాయం ఎవరిది అన్యాయం? చూడబోతే వీళ్ళకు ఇదొక ఆటలావుంది.' అనుకునేవారు అంతా. ఒక్కోసారి గేబ్రియల్‌కు జరిమానాపడేది. మరోసారి ఒకటి రెండు రోజులు విడిఖైదుకూడా. అప్పుడు ఇవాన్ పొంగి పోయేవాడు. గొప్ప ఘనకార్యం చేసినవాడికిమల్లే ప్రగల్భాలు పలికేవాడు. దాంతో గేబ్రియల్‌కు మరీ రోషం, ద్వేషం, వృద్ధికావడం, పగతీర్చుకోడానికి పూనుకోవడం జరిగేది. తరువాత ఇంకోసారి ఇవాన్‌కు జరిమానో, శిక్షో పడేది. అప్పుడు గేబ్రియల్ మీసాలు మెలేసేవాడు. విజయం సాధించానని

విగ్రహిగేవాడు. దాంతో ఇవాన్ మనసులో ద్వేషాన్ని నా లోకనడం, పగసాధించాలనే పట్టుదల పెచ్చుకావడం సంభవించేది. ఆఖరుకు ఊళ్ళో పెద్దమనుషులకూ, కోర్టులో న్యాయమూర్తులకూ ప్రాణం విసిగిపోయి, ఇరువురినీ, అసహ్యంగా తోసాగారు. వీరి జీవితాలు కుక్కలకంటే హీనమైపోయాయి. మనస్సుకు శాంతిలేదు. కంటిమీద నిద్రలేదు. ఎప్పుడూ పగ, ద్వేషం, హింస ఇవే వాళ్ళ ఆలోచనలు. ఆ విధంగా ఆరు సంవత్సరాలు గడిచాయి.

ఇవాన్ తండ్రి మంచంమీద పడుకుని అనేకసార్లు మందలించేవాడు.

'అబ్బాయీ! ఈ వైరాలు మనుషుల్ని వెర్రివాళ్ళను చేస్తాయి. పోరునష్టం, పొందులాభం అన్నారు పెద్దలు. కలహాలు కూడవు నాయనా! మీమనస్సుల్లోని ద్వేషం, ఈర్ష్యా కోపం, వదిలిపెట్టండి. అప్పుడు మీకు ఎంతో హాయిగా వుంటుంది' అంటూ అతను నెత్తిన నోరుపెట్టుకుని కొట్టుకునేవాడు.

కాని వృద్ధుడి మాటలు ఎవరూ లెక్కచేయలేదు. ఈ తగాదాలు ప్రారంభమై అప్పటికి ఆరేండ్లు. ఏడో ఏడు ప్రవేశించింది. ఊళ్ళో ఒకరింట్లో పెళ్ళి కార్యానికి అంతా సమకూడారు. అప్పుడు ఇవాన్ కోడలు పదిమందిలో గిల్లికజ్జా తెచ్చుకుంది. గుర్రాలను దొంగిలిస్తూవుంటే, గేబ్రియల్‌ను పట్టుకున్నారని చెప్పింది. దాంతో గేబ్రియల్‌కు నలుగురిలో అవమానం జరిగింది. అప్పుడతను కాస్త తాగి నిషాలోఉన్నాడు. వెంటనే ఒక్క దుముకులో వెళ్ళి ఆమెనులాగి కొట్టాడు. తక్షణం ఆ ఆడకూతురు గింగుర్లు తిరిగి కిందపడిపోయింది. వారంరోజులు

దా కా మళ్ళీ లేవలేదు. అప్పుడామె గర్భవతికూడా. ఇవాన్, తన కోడల్ని గేబ్రియల్ కొట్టాడని మాజిస్ట్రేట్ దగ్గర కేసు పెట్టాడు. కాని మేజిస్ట్రేట్ దాన్ని దాఖలుచేసుకోకుండా తిరస్కరించాడు. డాక్టరు పరీక్షచేస్తే దెబ్బలేమీ కనుపించలేదని కారణం చూపించాడు. అప్పటికామె లేచి తిరుగుతోందికూడా. అయినా ఇవాన్ ఊరుకోలేదు. బెంచికోర్టుకు వెళ్ళాడు. బెంచి మాజిస్ట్రేట్ కేసును జిల్లాకోర్టుకు పంపి తన బాధ తప్పించుకున్నాడు.

ఈసారి ఇవాన్ తన కేసు ఎలాగైనా నెగ్గాలనే వుద్దేశ్యంతో ఒక ఉపాయంకూడా పన్నాడు. జిల్లాకోర్టు హెడ్ గుమాస్తాకు, క్రిమినల్ బ్రాంచి గుమాస్తాకు లంచం పెట్టాడు. ఒకటోరకం సారాయి ఆ ఇద్దరికీ ముస్తుగా పంపించాడు. చివరకు కేసు విచారణ జరిగి గేబ్రియల్‌కు శిక్షపడింది 'ముద్దాయిని దోషిగా నిర్ణయిస్తూ కొరడాతో ఇరవై దెబ్బలు కొట్టాలని తీర్పు చెప్పడమైంది' అంటూ గుమాస్తా తీర్పు చదివి వినిపించాడు.

ఆ తీర్పువిని గేబ్రియల్ మొహం నల్లగా మాడిపోయింది. మొహం తిప్పేసుకున్నాడు. చరచరా కోర్టు విడిచి వెళ్ళిపోయాడు. అతని చర్యలు గమనిస్తూనేఉన్నాడు ఇవాన్. వెంటనే తనుకూడా గేబ్రియల్‌ను వెంబడించాడు. ఇవాన్‌ను చూచి గేబ్రియల్ క్రోధోద్రిక్తుడయ్యాడు. 'నన్ను కొరడాతో కొడతారు. వళ్ళంతా మంటలు పుడతాయి. కాని అవి ఆరిపోవనేమాట జ్ఞాపకం వుంచుకో. అంతకు అంతా అనుభవిస్తావు.

ఆ మంటల్లో ఆహుతి అవుతావు జాగ్రత్త!' అన్నాడు గేబ్రి యల్. అతని పెదవులు వణికాయి.

అది విని ఇవాన్ మళ్ళీ కోర్టువారి వద్దకు పరుగుతీశాడు 'అయ్యా! ఇవాన్ నా ఇంటికి నిప్పుపెడతానంటున్నాడు. ఇం తకు ఇంతా చేసి పగతీర్చుకుంటానంటున్నాడు. నామాట అబద్ధ మేమో అక్కడున్నవాళ్ళను అడగండి' అంటూ మొరపెట్టు కున్నాడు.

న్యాయమూర్తులు గేబ్రియల్‌ను వెనక్కు పిలిచి అడి గారు.

'అతని ఇంటికి నిప్పుపెడతానన్నావట నిజమేనా?'

'నేను ఏమీ అనలేదు. మీరే అనుకోండి అన్నీ! నేరం చేయకపోయినా నాకు శిక్ష విధించారు. అధికారం మీ చేతుల్లోవుంది. మీ ఇష్టంవచ్చినట్లు చేయండి! మీరు న్యాయాధిపతులు!' గేబ్రియల్ ఇంకా ఏమేమో అనబో యాడు కాని అతని కంఠం రుద్ధమైపోతోంది. అవమానం వళ్ళంతా దహిస్తోంది. అవయవాలు స్వాధీనం తప్పిపోతు న్నాయి. మొహం కళాహీనమైపోయింది. మొహం అవతలికి తిప్పేసుకున్నాడు.

అతని స్వరూపం చూస్తే నిజంగా ఏదో అఘాయిత్యం చేసేవాడిలా అగుపిస్తున్నాడు. అది చూచి ఒక జడ్జీ ఇలా అడిగాడు. 'ఏమయ్యా! ఇంతటనైనా మీవిరోధాలు పోగొట్టు కోండి, రాజీపడండి. నీవు గర్భిణీ స్త్రీని కొట్టావు. ఆడదాని మీద చేయిచేసుకోడం మహాఅపరాధం. లేచినవేళ మంచిది కాబట్టి సరిపోయిందిగాని, లేకపోతే ప్రాణంమీదికి వచ్చేపని.

అయిందేదో అయింది. మీరిద్దరు రాజీపడితే శిక్షను సరిదిద్దడం మాచేతుల్లో పని.'

అది హెడ్‌గుమాస్తా విన్నాడు. వెంటనే అందుకున్నాడు. మరి ఇవాన్ తనకు లంచం ఇచ్చాడుగా. రాజీపడితే తనకు వచ్చేలాభం పోతుందని అతని ఉద్దేశ్యం.

'ఆ! ఇప్పుడేం రాజీ అండి పోగరాజీ, అంతా అయిపోయింతరువాత? రూల్సు ప్రకారం శిక్ష అమలుజరపాల్సిందే?' అన్నాడు హెడ్ గుమాస్తా.

కాని జడ్జి ఊరుకోలేదు. అతను వయోవృద్ధుడు. ఎలా అయినా ఇద్దరిమధ్య కార్పణ్యాలు పోగొట్టాలని ఆయన ప్రయత్నం.

'నీవు గుమాస్తావు. నీవు ఎంతవరకువుండాలో అంతవరకేవుండాలి. ఇందులో నీజోక్యం అనవసరం. అయినా! రూల్సు ఏమిటయ్యా రూల్సు? రూల్సు మనం పెట్టుకున్నవేగా! మనుషులంతా పరస్పరం ప్రేమించుకుంటూ, అన్యోన్యంగా మెలగాలని దేవుడిశాసనం, అదే రూల్సు. ఆశాసనాన్ని మనం శిరసావహించాలి' అన్నాడు మళ్ళీ జడ్జి.

కాని చివరకు గ్రేబియల్ కూడా రాజీపడడానికి ఇష్టపళ్ళేదు.

నా కిప్పటికే యాభై ఏళ్ళు దాటాయి. కొడుకూ కోడలూ వచ్చారు. ఇంతవరకూ నాజన్మలో ఇలాంటిశిక్ష ఎరగను. ఎవడిచేతా దెబ్బలు తినలేదు. చావుదలకు లావుదుఃఖమన్నట్లు, చివరకీ దురాత్ముడు, ఇవాన్ మూలంగా ఇలాంటి పరాభవం

పొందాల్సివచ్చింది. ఇప్పుడు నేను వాణ్ణి క్షమాపణ వేడు కుంటానా? అసంభవం' అన్నాడు గేబ్రియల్.

అతను మాట్లాడుతోంటే వళ్ళంతా కంపించింది. మాట పెగిలి రావడంలేదు. గేబ్రియల్ అక్కడ నిలబళ్ళేక వెళ్ళి పోయాడు.

పట్టణానికీ, గ్రామానికీ ఏడుమైళ్ళదూరవుంది. ఇవాన్ తన ఇల్లు చేరుకునేసరికి దివెలు వెలిగాయి. ఇంట్లో ఆడవాళ్ళు గొడ్లకు పాలుతీయడానికని వెళ్ళారు. తను గుర్రం దిగి, దాన్ని కొష్టంలో కట్టేశాడు. కొడుకులుకూడా పొలాలనుంచి ఇంటికి రాలేదు. ఒక్కడూ బెంచిమీద కూచుని ఆలోచించసాగాడు. ఆరోజు కోర్టులో జరిగిన విషయాలన్నీ అతని కళ్ళల్లో మెదులు తున్నాయి. గుమాస్తా తీర్పును చదివి వినిపించడం, అదివిని గేబ్రియల్, మొహం మాడ్చుకోవడం అతని కంఠధ్వని సన్నగిలడం, ద్వేషంతో వళ్ళంతా దహించుకపోతూ అతను అన్నమాటలు, అన్నీ గుర్తుకొచ్చాయి. ఎందుకో తలవని తలంపుగా గేబ్రియల్ మీద జాలి, సానుభూతి పుట్టుకొచ్చాయి.

ఇవాన్ ఇంటికిరావడం ముసలాడు చూచాడు. మెల్లగా ఓపిక తెచ్చుకుని మంచం మీదనుంచి లేచాడు. కొడుకుదగ్గర కొచ్చి బెంచీమిద కూలబడ్డాడు. కాని ఆ మాత్రానికే అతనికి దగ్గూ, ఆయాసం వచ్చింది. కొంతసేపటికి ఊపిరి తిప్పుకుని బల్లమీద తల ఆనించాడు.

'ఏమైందిరా అబ్బాయ్ ? తీర్పుచెప్పారా ?' అని అడిగాడు మెల్లగా.

'ఆఁ శిక్ష వేశారు. ఇరవై కొరడా దెబ్బలు కొట్టమన్నారు' చెప్పాడు ఇవాన్.

వృద్ధుడు తల ఊపాడు.

'ఇవాన్! ఇది మంచిపని కాదునాయనా! ఎన్ని విధాల చెప్పినా నీవు వినడంలేదు. నీవొక విషయం గ్రహించడం లేదు. ఇది ఊరికేపోదు. నీపాపంనిన్ను కట్టికుడుపుతుంది. నిన్ను నీవే నాశనం చేసుకుంటున్నావు, అవతలవాడు అంత బాధపడుతోంటే నీకు సుఖం ఎక్కణ్ణించి వస్తుందిచెప్పు?' అన్నాడు తండ్రి మెల్లగా. 'వాడికీ శాస్తి జరగాల్సిందే. రెండోసారి ఇలాంటిపని చేయకుండా బుద్ధొస్తుంది' అన్నాడు ఇవాన్ కోపంగానే. 'ఎందుకని? నీకంటెవాడు చెడ్డ వాడా చెప్పు! వాడు చేసిందేమిటి, నీవు చేయందేమిటి?' మళ్ళీ అడిగాడు తండ్రి. తండ్రిమాటలు వింటోన్నకొద్దీ ఇవాన్‌కు మరీ కోపంవస్తోంది.

'ఆడదానిమీద చేయిచేసుకున్నాడు. పైగా నా ఇంటికి నిప్పు పెడతానన్నాడు. ఇవి చాలవూ? ఇలాంటివాణ్ణి నెత్తిన పెట్టుకుని పూజించమంటావా' అడిగాడు ఇవాన్ గట్టిగా.

అది విని వృద్ధుడు ఇలా చెప్పసాగాడు.

అబ్బాయీ! నేను ఈ ఏడు సంవత్సరాలబట్టీ మంచం మీదికాలు కిందపెట్టి ఎరగను. నీవే అన్నిపనులూ చూచుకుంటున్నావు. లోకమంతా చుట్టబెట్టి వస్తున్నావు. అంచాత నా కంటె ఎక్కువ లోకజ్ఞానం వుందనీ, నాకేమీ తెలీదని నీ ఉద్దేశం కాబోలు. ఇవాన్! ఇది నీ అజ్ఞానం తప్ప మరేంకాదు. క్రోధం నీకళ్ళను కప్పేసింది. ఇతర్ల తప్పులు కనిపిస్తాయిగాని

నీ తప్పులు నీకు తెలీవు. అవతలివాడు చెడ్డవాడూ, నీవు మంచివాడివి, అని నీ అభిప్రాయం. అలా అయితే ఇంతదూరం వచ్చేదికాదు. ఒకచేత్తో కొడితే చప్పుడవుతుందా? రెండు చేతులతో కొడితే మోగుతుంది. కనుక ఆవిషయం గ్రహించుకో. గేబ్రియల్‌కు నీ వొడులోనూ తీసిపోవు. వాడిగడ్డం పీకేశావు. వాడిగడ్డి కాజేసావు. వాడిమీద కేసులుపెట్టి కోర్టుకు తిప్పించావు. అడిగితే వీటన్నిటికీ కారణం వాడేనంటావు అంతే కాదూ.? పిచ్చివాడా! ఈపాపంలో మీ ఇద్దరూ సమాన భాగస్తులే. ఇంత నీచంగా నేను జీవించలేమురా అబ్బాయ్! గేబ్రియల్ తండ్రీ నేనూ, శరీరాలు వేరైనా ఆత్మలు ఒకటిగా జీవించాం. వాళ్ళింట్లో రొట్టెచేసుకోడానికి గోధుమపిండి అయిపోతే అతనిభార్యవచ్చి అడిగేది. 'దానికేవమ్మా! కుండలోవుంది. కావల్సినంత తీసుకెళ్ళు' అనేవాణ్ణి నేను. వాళ్ళకు మనుష్యులెవరూ లేకపోతే, వాళ్ళ గుర్రాల్ని పొలం తోలుకుపొమ్మని నిన్నే పంపేవాణ్ణి. నీవు పసివాడివి. గుర్తుందోలేదో? అలాగే నాకు అవసరమైనప్పుడు వెళ్ళి ఏది కావల్సివస్తే అది అడిగేవాణ్ణి. గేబ్రియల్ నాన్న, ఒక్కమాట అయినా అడ్డు చెప్పకుండా తీసుకపొమ్మనేవాడు. అలా అన్యోన్యంగా, సుఖంగా, జీవించాను. నిన్న ఇక్కడికి ఎవడో మిలిటరివాడొచ్చాడు. ఏదో యుద్ధాన్ని గురించి చెప్పాడు. ఎంత భయంకరంగా వుందని? అలాగేవుంది ఇప్పుడు మీ ఇద్దరిపని. అంతకంటే భయంకరమైన యుద్ధం జరుగుతోంది. మానవ జీవితానికి ఇదేనా లక్ష్యం? మొన్న ఆ పసివాడు, తారాస్ వాళ్ళపిల్ల అకే

నాను బండబూతులు తిడుతూవున్నాడు. అదిచూచి వాడితల్లి అదొక ఘనమనుకుని నవ్వుతూ ఆనందిస్తోంది. ఇదంతా చేనివల్ల వచ్చింది? నీవే కారణం. ఏసు ప్రభువు ఏంబోధించాడో తెలీదూ? 'నీకు అపకారం జరిగినా, సహించు. నిన్ను ఒక చెంపమీద కొట్టిన వాడికి రెండో చెంప అందించు. అలా చేస్తే అవతలి వాడు ఎంతదుర్మార్గుడైనాసరే పరివర్తన పొందుతాడు. అతని మనస్సు మారుతుంది. అలాకాక దెబ్బకు దెబ్బ, మాటకు మాట, తీర్చుకోమని చెప్పలేదే? మాట్లాడవేం? నేచెప్పింది సబబుగా లేదా?'

అలా చెప్పి వృద్ధుడు గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు. ఇవాన్ తండ్రి చెప్పిందంతా విన్నాడు. జవాబు చెప్పలేదు. మళ్ళీ ముసలాడికి దగ్గుతెర వచ్చింది. అంతసేపు మాట్లాడేసరికి ఆయాసం, దగ్గు, ఏకమై అతన్ని ఊపిరి సలుపుకో నివ్వలేదు. తరువాత కాసేపటికి తేరుకున్నాడు.

'ఇవాన్ ! నీకే చెప్పేది మాట్లాడవేం ? నేను పొరపాటు మాట్లాడానా ? ఆలోచించుకో. ఈ కలహాలు రాకముందు నీ వెలా ఉండేవాడివి. ఇప్పుడు నీమనస్సు ఎలావుంటోంది. అప్పుడు హాయిగా వుండా, లేక ఇప్పుడా? ఈ పాడు కోర్టు వ్యవహారాలవల్ల ఇల్లు, వళ్ళూకూడా ఎంత గుల్ల అవుతూందో ఆలోచించావా ? కోర్టు కెక్కితిరో కొలుపోతివో అన్నారు పెద్దలు. నీవు చిన్నవాడివి కాదు. నీ కొడుకులు నీ అంత అయ్యారు. వాళ్ళు సంపాయించుకొచ్చి పెడితే నీవు సుఖంగా తిన్నాలిందిపోయి, నీవే ఈ రొంపిలో పడి కొట్టుకోవడం మొదలెట్టావు. దీనికంతకూ నీ అహంకారం, క్రోధం, ఆవేశం. ఇవే

కారణాలు. పొలం పనులు మానుకుని నీవ్వూ, నీ కొడుకులూ వ్యాజ్యాలకోసం తిరుగుతున్నారు. పొలంపోవని పొలం పాడై పోయింది. ఈ ఏడు పశ్లు పండాయా? కారణం ఏమిటి? సరైన అదునులో విత్తనం వెయ్యలేదు. పొలం దున్న లేదు. అందుకే అలా జరిగింది. వాడు నీకు అపకారం చేశాడే అనుకో నీవ్వూ నీ కొడుకులూ అతని జోలికి పోకుండా క్షమించి వూరు కుంటే, ఇంత జరిగేదా? ఎంతో సుఖపడేవాడివి. మళ్ళీ కొడుక్కి నీతులు బోధించాడు వృద్ధుడు.

ఇవాన్ అప్పటికీ మాట్లాళ్ళేదు. వృద్ధుడే మళ్ళీ ఇలా చెప్పాడు:

'ఇవాన్! ఇంకనైనా నామాట విను! వెళ్ళు! వెంటనే గుర్రంమీదవెళ్ళి ఆ కోర్టు వ్యవహారాలన్నీ మాపుచేయించు. రేపు పొద్దున్నే గేబ్రియల్ ఇంటికివెళ్ళి అతనితో మాట్లాడు. జరిగినవన్నీ మరిచిపో. రేపు పవిత్రమైన పండుగకూడా. సెలవు రోజు. గేబ్రియల్‌ను మనింటికి విందుకు పిలువు. ఇహ ముందు ఇలాంటి పనులుచేయనని ఒట్టుపెట్టుకోండి. నీ ఆడవాళ్ళకూ, పిల్లలకూకూడా అలాగే చేయమని చెప్పు.

ఇవాన్ అంతా విని ఆలోచించుకున్నాడు. తండ్రి చెప్పింది, అక్షరాలా నిజం, అని తోచింది అతనికి. అలా అను కునేసరికి అతని గుండె బరువు ఎంతగానో తగ్గినట్లయింది. కాని ఇంత పెద్దతగువు, తుఫానులాంటి కలహం; దీనినుండి బయట పడడం ఎలాగా? గేబ్రియల్‌తో స్నేహం చేయడం ఎలాగా? అనేదే అతని ఆలోచన.

అదిచూచి కొడుకు కొంచెం కొంచెం దోవకువస్తున్నా డని గ్రహించాడు తండ్రి. మళ్ళీ ఇలా అన్నాడు:

'వెళ్ళు ఇవాన్! ఆలస్యంచేయకు. వెంటనేవెళ్ళి ఆపని చేయి. నిప్పు అంటుకోగానే ఆర్పివేయాలి. అశ్రద్ధచేస్తే అంతటా వ్యాపిస్తుంది. తరువాత ఆ మంటను ఆర్పడం ఎవరికీ తరంకాదు.' అలా అంటూ అతనింకా ఏదో చెప్పబోయాడు. కాని అంతలో ఇవాన్ భార్యా, కోడళ్ళూ, లోపలికొచ్చారు. అంతా తలొక మాట అందుకున్నారు. గేబ్రియల్‌కు శిక్షపడిందని వాళ్ళ కప్పుడే తెలిసిపోయింది. ఇంటికి నిప్పుపెడతామని అతను అన్నమాటకూడా వాళ్ళ చెవికి వచ్చింది. ఇంకేం? వీటికి ఎన్నో ఉన్నవీ, లేనివీ చేర్చి వాగడం మొదలెట్టారు. గేబ్రి యల్ భార్యతో, పొలంలోనే తగువులాడారు. గేబ్రియల్ కోడలు అన్నమాటలు చెప్తున్నారు.

'ఇంతకు ఇంతా చేసితీరుతాం. ఊళ్ళో బడిపంతులు చేత ఒక అర్జీ వ్రాయించి చక్రవర్తి గారికి పంపాం. బండి చాయిలు దొంగిలించడం, మా పండ్లతోటలంతా పాడుచేయడం, ఇవన్నీ అర్జీలో వ్రాశాం.' అని చెప్పిందట గేబ్రియల్ కోడలు.

ఇదంతా వినేసరికి ఇవాన్ మనస్సు మళ్ళీ కలత పడింది. 'ఇలాంటి వెధవతో రాజీఏమిటి?' అనుకున్నాడు తనలో.

ఇవాన్ ఆడవాళ్ళతో మాట్లాళ్ళేదు. అవతల ఇంకా అనేక పనులున్నాయి. లేచి పశువుల కొట్టంలోకి వెళ్ళాడు. అక్కడ చేయాల్సినపని ముగించుకొని వీధి వాకిట్లోకివచ్చాడు. అప్పటికి సూర్యాస్తమయం కావస్తోంది. కొడుకులు పొలా

ల్నుంచి ఇంటికి వస్తున్నారు. పొలాల్లో గోధుమలు చల్లే కాలం అది. పొలం పనులు ఎంతవరకు అయ్యాయో కొడుకుల్ని అడిగి తెలుసుకున్నాడు ఇవాన్. తరువాత వ్యవసాయపు పనిముట్లన్నీ ఎక్కడివక్కడ సద్దుకున్నాడు.

తరువాత గుర్రం మెడకు తగిలించే పట్టీలు, పాడయిపోతే బాగుచేసుకున్నాడు. అప్పటికి చీకటి పడింది. గొడ్లకు మేత వేశాడు. అంతలో తారాస్ వస్తే గుర్రాల్ని మేతకు తోలుకపొమ్మని చెప్పాడు. దొడ్డి గేటు తీసి గుర్రాల్ని బయటికి తోలాడు తరువాత గేటుకు గడియ వేసి ఇంట్లోకేరా బోతున్నాడు.

'ఇప్పటికి పనులన్నీ ముగిశాయి. త్వరగా భోంచేసి పడుకుంటాను' అనుకున్నాడు ఇవాన్. ఇంతలో అకస్మాత్తుగా అవతల్నుంచి గేబ్రియల్ గొంతుక వినిపించింది.

ఆపని చేస్తూవున్న కాసేపూ ఆ విషయాలన్నీ మరిచిపోయాడు ఇవాన్. గేబ్రియల్ మాటలు వినేసరికి మళ్ళీ అన్నీ గుర్తుకొచ్చాయి. అతని వళ్ళు గగుర్పొడిచింది. ఏదో విషసర్పాన్ని తొక్కినట్లనిపించింది. తిరిగీ ద్వేషాగ్ని రగిలింది. గేబ్రియల్ తిడుతూవున్న తిట్లన్నీ విన్నాడు తల ఊపి ఇంట్లో అడుగు పెట్టాడు. లోపల దీపం వెలుగుతోంది. కోడలు ఓ మూల కూచుని నూలు వడుకుతోంది. భార్య వంటింట్లో భోజనానికి ఏర్పాట్లు చేస్తోంది.

పెద్దకొడుకు జోళ్ళు తయారుచేయడానికి కావల్సినవేవో పనిముట్లు బాగుచేస్తున్నాడు. చిన్నకొడుకు బల్లదగ్గర కూచుని

చదువుకుంటున్నాడు. ఎంత చక్కని సంసారం! ఈ పొరుగు వాడి పీడ పడలేకపోతే నిజంగా తన ఇల్లు, కళకళలాడుతూ వుంటుంది. ఈ దుర్మార్గుడు తన కెక్కడ దాపురించాడు? ఇవాన్ హృదయంలో బాకులు పొడిచినట్లుగా వుంది.

ఏదో ఆవేశంతో లోపలికి వచ్చాడు. బల్లమీద ముడుచుకుని కూచున్న పిల్లని లాగి కింద పడేశాడు.

చేతులు కడుక్కోడానికి దొడ్లోకివెళ్ళి ఏదో కారణంగా ఆడవాళ్ళను తిట్టాడు. తరువాత వచ్చి బెంచీమీద కూలబడ్డాడు. గుర్రం మెడపట్టీ బాగుచేయడం మొదలెట్టాడు. కాని అతని మనస్సు పనిలో లేదు. గ్రేబియిల్ మీదే అతని ధ్యాస అంతా. కోర్టులో తనను అన్న మాటలు గుర్తొస్తున్నాయి. ఇంటికి నిప్పంటిస్తాననడం, పగతీర్చుకుంటాననడం, అంతా జ్ఞాపకం వచ్చింది.

అంతలో తారాస్ భోంచేసి ఉన్నికోటు వేసుకున్నాడు. కొన్ని రొట్టెలు తీసుకుని జేబులో పెట్టుకున్నాడు. గుర్రాల దగ్గరకి వెళ్ళడానికి బయటికి వచ్చాడు. పెద్దవాడుకూడా తమ్ముడి వెంట వెళ్ళాలని తయారవుతున్నాడు.

అప్పుడు ఇవాన్ లేచి వీధి వాకిట్లోకి వచ్చాడు. అంతా చీకటిగావుంది. పైన మబ్బు పట్టింది. చల్లనిగాలికూడా వీస్తోంది. తారాస్ గుర్రం ఎక్కుతూంటే, తనుకూడా సహాయం చేశాడు. గుర్రపు పిల్లను దాని వెనకాలే తోలి పంపించాడు. కొడుకు వెడుతోంటే చూస్తూ నిలుచున్నాడు ఇవాన్. కనుచూపు దాటేంతవరకూ నిలబడిపోయాడు. గుర్రపు గిట్టలధ్వని అతల

గుండెల్లో ప్రతిధ్వనిస్తోంది. 'గేబ్రియిల్ నిజంగా నిప్పు అంటిస్తాడా !'

'వాడెంతకైనా తెగిస్తాడు ' అనుకున్నాడు మళ్ళీ ఇవాన్. ఇటీవల ఎండలు బాగావున్నాయి. గాలికూడా విపరీతంగావుంది. వెనుక దొడ్లోంచి దూకి వాడు ఏగడ్డిలోనో, గాదంలో కాస్త నిప్పురవ్వపడేశాడూ అంటే, ఇల్లంతా అరగంటలో తగలడిపో తుంది. ఎలా నిప్పుపెట్టిందీ ఎవడూ తెలుసుకోలేడు.' అలా ఆలోచించుకున్నకొద్దీ ఇవాన్కు మతిపోతున్నట్లయింది. వెంటనే ఇంట్లోకిపోకుండా పక్కసందులోకి మళ్ళాడు. మెల్లగా దొడ్లో కిపోయి ఇంటిచుట్టూ ఒకమాటు చూదొద్దామనుకున్నాడు. అడుగులో అడుగు వేసుకుంటూ చప్పుడు కాకుండా నడిచాడు. కంచె పక్కన దాక్కుని అవతలి వైపుకు ఒక క్షణం చూచాడు. కొంచెం దూరంగా ఏదో కదిలినట్లనిపించింది. కళ్ళు పెద్దవిచేసి పరీక్షగా చూస్తున్నాడు ఆ చీకట్లో. ఆ అంధకారంలో ఏమా త్రం అలికిడిలేదు. అంతా నిశ్శబ్దం. గాలి మందంగా వీస్తోంది. గాలికి ఎండుటాకులు గలగలమంటున్నాయి. అంతకు తప్ప అతనికి ఇంకేమీ కనిపించడంలేదు, వినిపించడంలేదు.

'ఇదంతా నా భ్రమ. అంతకన్నా మరేంలేదు. ఒకసారి చుట్టూ తిరిగిచూచి, వెళ్ళి పడుకుంటాను' అనుకుని కంచె పక్క గుండా మెల్లగా నడుస్తున్నాడు. కాళ్ళకు జోళ్ళువున్నా మెల్లగా నడవడంవల్ల శబ్దంలేదు. అలా వెళ్ళివెళ్ళి అవతలి వైపుకు చేరాడు. అక్కడ నాగలి, మరికొన్ని పనిముట్లువున్నాయి. అంతలో అకస్మాత్తుగా ఏదో మిణుకుమిణుకుమని మెరిసి అదృ శ్యమైంది. ఇవాన్కు గుండె గుబుక్కుమంది. మళ్ళీ ఏదోకాంతి

ఎదురుగా ఎవరో వంగి గడ్డితొట్టెను నిప్పంటిస్తున్నాడు. మళ్ళీ గుండెలు దడదడకొట్టుకున్నాయి. గభాలున ముందుకువెళ్ళాడు.

'ఈతడవ తప్పించుకోవడం నీతరంకాదు. అంటూ ఇవాన్ త్వరత్వరగా వెళ్ళాడు. అప్పటికే ధాన్యపు గాదెల దగ్గర వున్న గడ్డికుప్ప అంటుకుంది. మంటలు పైకిలేవడం ప్రారంభించాయి. ఆ వెలుతురులో అతనికి గేబ్రియల్ స్పష్టంగా అగుపించాడు.

గభాలున ముందుకు దూకి మీదపడబోయాడు ఇవాన్. కాని ఆ చప్పుడుకు గేబ్రియల్ వెనక్కి తిరిగిచూచి, వెంటనే పరుగెత్తాడు.

'ఎక్కడికిపోతావురా గాడిదకొడకా!' అంటూ ఇవాన్ అతని వెంట పడ్డాడు. గేబ్రియల్ చొక్కా, చేతికి చిక్కింది. కాని అతను తప్పించుకున్నాడు. తరువాత అతని కోటును పట్టుకున్నాడు ఇవాన్. కాని గేబ్రియల్ మళ్ళీ తప్పించుకొని అవతలికి దూకాడు. కోటుమాత్రం చిరిగిపోయింది. ఆ తూలుడుకు ఇవాన్ వెనక్కి పడ్డాడు. మళ్ళీ లేచి పరుగు లంకించుకున్నాడు. 'దొంగ! దొంగ! పట్టుకోండి! పట్టుకోండి!' అంటూ అరిచాడు ఇవాన్.

గేబ్రియల్ తన దొడ్లోకి వెళ్ళాడు. ఇవాన్‌కూడా దొడ్లోకి దూకి అతన్ని పట్టుకోబోతున్నాడు. కాని అంతలో ఇవాన్ తలమీాద ఏదోపడింది. గేబ్రియల్ అక్కడున్న కర్ర ముక్కను తీసుకుని బలంగా కొట్టాడు. ఇవాన్‌కు కళ్ళు చీకట్లు కమ్మాయి. ఆ దెబ్బకు అతని తల తిరిగిపోయింది. వెంటనే నేలమీాద కుప్పగా కూలిపోయాడు. అతనికి స్పృహ వచ్చేసరికి

అంతా వెలుతురు; పట్టపగలులావుంది. చుట్టూ జనం మూగి వున్నారు. అంతాగోల, సందడి, తన ఇంట్లో గడ్డికుప్ప తగల బడి, ఆ తరువాత గాదెలకు అంటుకుంది. వరుసగావున్న గాదెలు తగలబడుతున్నాయి. గాలికి మంటలు పెటపెటమంటూ ఆకాశం ఎత్తున లేస్తున్నాయి. అగ్నికి వాయువుతోడు' అన్నట్లుగాలి బాగావీస్తోంది. మంటల్లోంచి నిప్పురవ్వలు కుప్పలు కుప్పలుగా లేచి తన ఇంటిమీద పడుతున్నాయి.

'అమ్మో! నాయనో! అంతా నాశనం అయిపోయిం దయ్యో!' అంటూ అరుస్తూ నెత్తిబాదుకుంటున్నాడు ఇవాన్, 'అయ్యయ్యో! ఎంత పాడుపని చేశానయ్యా! మొదటే ఆగడ్డి కుప్పకు అంటించిన తుట్టెను ఆర్పేస్తే ఇంత ఘోరం జరి గేదికాదయ్యా!' అంటూ పెద్దగా అరవబోయాడు. కాని నోటమాట రావడంలేదు తలమీద గాయంపడి మొహం మీదికి రక్తం కారుతోంది. లేవబోయాడు. కాని కాళ్ళు స్వాధీనంలోలేవు. అట్లాగే లేచి ఒక అడుగువేశాడు. కాని గుండెల్లో ఏదో ఎగతన్నుతూ ఉంది. ఊపిరి ఆడడంలేదు. ఒక క్షణం ఆగి మళ్ళీ మెల్లగా కంచె తిరిగి దొడ్లోకివెళ్ళాడు. రెండు గాదెలు తగలబడుతున్నాయి. ఇంటికి కూడా ఓమూల నిప్పంటుకుంది. ద్వారబంధానికి తాకింది. కాని ఇంటిముందుకు వెళ్ళడానికి వీలుకాకుండావుంది. బ్రహ్మాండంగా మంటలులేచి నాలికల్లా ముందుకు చాచుకుంటున్నాయి. చుట్టూజనం మూగారు. ఊళ్ళో రైతులు చాలామంది వచ్చారు. కాని ఎవరికీ, ఏంచేయడానికీ తోచడంలేదు. మంటను ఆర్పడాని క్కూడా శక్యంకాకుండావుంది. పక్కపక్కవారంతా తమ

ఇళ్ళల్లో సామాన్లు బయటపడేసుకుంటున్నారు. కొంతమంది కొట్టాల్లో, దొడ్లల్లో, కట్టేసిన పశువుల్ని, మెడతమ్మెలు ఊడదీసి బయటికి తోలుతున్నారు. కాసేపట్లో గేబ్రియల్ ఇంటికూడా నిప్పంటు కుంది. అలా చూస్తూవుండగానే, గ్రామంలో దాదాపు సగం ఇళ్ళు తగలబడిపోయాయి. గాలి బ్రహ్మాండంగా వీచడంవల్ల ఇంతపనీ, కాసేపట్లో జరిగిపోయింది.

ఇవాన్ ఇంట్లోవారంతా విశ్వప్రయత్నంమీద ప్రాణా లతో బయపడ్డారు. ఇవాన్ తండ్రిఅయిన ఆముసలాణ్ణికూడా ఎలాగో బయటికి లాగారు, కాని ఇంట్లోసామానంతా బుగ్గి పాలయింది. పశువులుకూడా అరుస్తూ ఆ మంటల్లోనే కాలి పోయాయి. గుర్రాలుమాత్రం పొలంలో వుండడంవల్ల బ్రతి కాయి. కోళ్ళు, వ్యవసాయపు పనిముట్లు, పెట్టెలు, బేడలు, బట్టలు, నగలు - నాణ్యాలు. ధాన్యం, అంతా అగ్నిదేవుడు ఆహుతి తీసుకున్నాడు.

గేబ్రియల్ ఇంట్లోంచి, ఏవో కొన్ని సామానులు మాత్రం బయటపడేసుకున్నారు. పశువుల ప్రాణాలుకూడా దక్కాయి. ఆవిధంగా ఆమంటలు తెల్లవార్లూ మండుతూనే ఉన్నాయి. ఇవాన్, కాలిపోతూన్న తన ఇంటివైపు అదేపనిగా చూస్తూ 'అయ్యో! పొరపాటుచేశానే? మొదట్లోనే ఆకాస్త గడ్డి తుట్టె ఇవతలికి లాగేస్తే ఇంతపని జరిగేది కాదే' అంటుం న్నాడు. ఇంటిదూలం కాలిపోతూ కప్పుఅంతా గుభేలుమని కూలింది. ఇవాన్ ఏదో ఆవేశం తెచ్చుకొని మంటల్లోకి చొర పడ్డాడు. ఆడాళ్ళు, పిల్లలూ 'అయ్యో అయ్యో' అని అరు

స్తున్నా అతను వినిపించుకోలేదు. శక్తి అంతా ఉపయోగించి దూలాన్ని ఇవతలికి లాగాడు.

తరువాత మరొకదానికోసం పరుగెత్తి, చూతగాక తూలి మంటల్లో పడ్డాడు. కొడుకులంతా అతి కష్టంమీద తండ్రిని ఇవతలికి లాగారు. ఇవాన్ కాళ్ళు, చేతులు, కమిలిపోయాయి. వంటిమీంది బట్టలు కాలిపోయాయి. గడ్డం, జుట్టూ, పూర్తిగా కాలాయి. అతనికి స్పృహలేదు.

'పాపం, అతనికి మతి చలించింది.' అన్నారు అంతా. తెల తెల వారుతూవుండగా, మంటల ఉధృతం కొంచెం తగ్గింది. ఇవాన్ అక్కడే వున్నాడు. 'మొదట్లోనే దాన్ని తీసేస్తే ఇంత పని జరగేదికాదే' అంటున్నాడు పదే పదే.

తెల్లవారింది. గ్రామాధికారికొడుకు ఇవాన్ దగ్గరికొచ్చి పిలిచాడు. 'మీ తండ్రిగారు మరణావస్థలో వున్నాడు. కడసారి నిన్ను చూడలంటున్నాడు. త్వరగా రా!' అని చెప్పాడు. అప్పటిదాకా ఇవాన్‌కు తండ్రిమాటే జ్ఞాపకం లేదు.

'అయ్యో! మా నాన్నా! ఎక్కడున్నాడు?' అన్నాడు కొంచెం తెప్పరిల్లుకుని.

'మా ఇంట్లో పడుకోబెట్టారు. నిన్ను రమ్మంటున్నాడు' అని చెప్పాడు గ్రామాధికారి కొడుకు.

ఇవాన్ అతని చేయిపట్టుకుని అక్కడికి వెళ్ళాడు. ఆ ముసలాడికి వళ్ళంతా కాలిపోయింది. ఊరికి అవతలవైవున్న గ్రామాధికారి ఇంటికి మోసుకపోయి అక్కడ పడుకోబెట్టారు. అతని చుట్టూ కొంతమంది వృద్ధురాండ్రు, పిల్లలు మూగి వున్నారు. ఇవాన్‌ను చూడగానే ఒక వృద్ధురాలు —

'ప్రోల్! నీకొడుకు వచ్చాడు చూడు!' అంది పెద్దగా అతనిమీదికి వంగి.

ఇవాన్ తండ్రి అయిన ప్రోల్‌ను, ఒక బల్లమీద పడుకో పెట్టారు. ఆయన చేతిలో ఒక కొవ్వొత్తి వెలుగుతోంది. కొడుకును గుర్తించాడు. దగ్గరికి రమ్మని సైగచేశాడు. ఇవాన్, తండ్రి పక్కకు వెళ్ళి నిలుచున్నాడు.

'అబ్బాయీ! ఇహ నేను చెప్పాల్సింది ఏముంది? ఊరు తగలబెట్టింది ఎవరో చెప్పు?' అన్నాడు మెల్లగా.

'వాడే నాన్నా! గ్రేబియల్ గడ్డితుక్కుకు నిప్పంటించి మన కుప్పలో పెట్టాడు, నేను పట్టుకున్నాను. కాని అప్పుడే దాన్ని ఇవతలికి లాగేసి ఆర్పివుంటే ఇంత పని జరిగేదికాదు' అన్నాడు ఇవాన్ దీనంగా.

'ఇవాన్! నాకు కాలం సమీపించింది వెళ్ళిపోతున్నా! నీకూ ఎప్పటికైనా చావు తప్పదు. ఈతప్పంతా ఎవరిదో చెప్పు' అన్నాడు వృద్ధుడు కొంచెం గట్టిగా.

ఇవాన్, తండ్రికేసి తేరి పారచూచాడు. ఏం జవాబు చెప్పాలో తెలీలేదు.

'దేవుడిమీద ఒట్టుపెట్టుకుని చెప్పు. దీని కంతకూ కారణం ఎవరు? చెప్పవేం? నీకు నేను చెప్పిందేమిటి? చివరకు నీవు చేసిందేమిటి?' అన్నాడు తిరిగీ ముసలాడు.

ఇవాన్‌కు అప్పుడు జ్ఞానం కలిగింది. లోగడ జరిగిన సంగతులు, తండ్రి చెప్పిన నీతులు గుర్తుకొచ్చాయి. లోపలనుంచి దుఃఖం పొర్లుకొచ్చింది. వెక్కి వెక్కి ఏడవడం మొద

లేట్టాడు. 'నాన్నా! ఈ తప్పంతా నాదే! నేనే దీనికంతకూ కారణం.' అన్నాడు ఇవాన్ అతికష్టంమీద.

తరువాత అతను తండ్రి పాదాలమీదపడి నమస్కరించాడు. 'దేవుడిపట్ల, నీపట్లకూడా ఘోరమైన తప్పుచేశాను. నన్ను క్షమించు నాన్నా!' అన్నాడు ఏడుస్తూనే. వృద్ధుడు తన ఎడమ చేతిలోవున్న కొవ్వొత్తి పైకి ఎత్తాలని ప్రయత్నించాడు. కాని చేయి లేవలేదు.

'ప్రభూ! నన్ను కరుణించు! ఇవే నావందనాలు!' అన్నాడు మెల్లగా.

'ఇవాన్! ఇప్పుడు ఏం చేయాలనుకుంటున్నావు?' అడిగాడు వృద్ధుడు మళ్ళీ.

'ఏం తెలీడంలేదు, నాన్నా. ఏంచేయాలో, ఎలా బ్రతకాలో తెలీకుండావుంది.' అంటూ ఇవాన్ మళ్ళీ బావురుమని ఏడ్చాడు.

వృద్ధుడు ఒకక్షణం కళ్ళుమూసుకున్నాడు. అతని పెదవులు వణుకుతున్నాయి. ఏదో బలంతెచ్చుకుని ఇలా అన్నాడు:

'పరవాలేదు. భయపడకు ఇవాన్! నీవుమంచివాడవతే అంతా మంచివాళ్ళేఅవుతారు. దేవుణ్ణి నమ్ముకుని, న్యాయంగా బ్రతుకు. నీకు ఏ విపత్తూరాదు'

మళ్ళీ ఒకక్షణం ఆగాడు వృద్ధుడు. అతని పెదవులమీద చిరునవ్వు మెరిసింది. మొహం వికసించింది.

'చూడు ఇవాన్! గేబ్రియల్ నిప్పుపెట్టాడని ఎవరితోనూ చెప్పకు. ఎప్పుడూ బయటపెట్టకు, ఒకరి తప్పును నీవు

క్షమిస్తే, నీతప్పును దేవుడు క్షమిస్తాడు. అంతే' అన్నాడు వృద్ధుడు అతి కష్టంమీాద.

తరువాత కష్టంమీాద రెండుచేతులూ పైకెత్తి జ్యోతిని గుండెలమీాద పెట్టుకున్నాడు. కళ్ళుమూశాడు,

* * * *

గ్రేబ్రియిల్ తనఇంటికి నిప్పుపెట్టాడని, ఇవాన్ ఎప్పుడూ ఎవరితోనూ చెప్పలేదు. క్రమక్రమంగా అతనిమీాది ద్వేషాన్ని చంపుకుంటున్నాడు ఇవాన్.

మొదట్లో గ్రేబ్రియిల్‌కు భయం పీడించసాగింది. ఇవాన్ తన విషయం బయట పెడతాడేమోఅని ఆందోళన పడ్డాడు. కాని రాను రాను ఇవాన్ ప్రవర్తన చూచి అతనికి ఆశ్చర్యం కలిగింది.

ఆ తరువాత ఎన్నడూ, ఆ ఇద్దరు పోట్లాడుకోలేదు. ఒకే పూరిల్లు వేసుకుని ఇద్దరూ అందులోనే వుంటున్నారు. రెండు కుటుంబాలు ఒద్దికతో మెలుగుతున్నాయి. రానురాను మాటలు కూడా కలిశాయి. ఒకరికొకరు సహాయం చేసుకుంటున్నారు.

ఊరంతా మళ్ళీ తిరిగికట్టాల్సివచ్చింది. అప్పుడు ఇవాన్, గ్రేబ్రియిల్, ఒకరిప్రక్కన ఒకరు వుండడానికే నిశ్చయించు కున్నారు. తమ రెండిళ్ళూ వెనుకటిమాదిరిగానే ఒకచోట కట్టుకున్నారు తండ్రులకు మల్లేనే ప్రాణస్నేహితు లయ్యారు. ఇవాన్‌కు, తన తండ్రి చెప్పినమాటలు నిరంతరం తలుపుకు వస్తుంటాయి.

'కలహం నిప్పులాంటి సమానం. దాన్ని మొదటే చల్లా ర్చాలి. అశ్రద్ధచేస్తే, అంతా నాశనం అవుతుంది' ఈ నీతిని అతను ఎన్నడూ మరిచిపోలేదు.

ఎవరైనా తనకు అన్యాయంచేసినా, సహించడం నేర్చుకున్నాడు. పగతీర్చుకోవాలనే ద్వేషం పూర్తిగా నశించింది. ఇవాన్ తన బిడ్డలకుకూడా ఇదేనీతిని బోధించాడు. అతని కుటుంబం హాయిగా, ప్రశాంతంగా జీవిస్తోంది.

# మూడు చావులు

## 1

అది ఆకులురాలే కాలం. రెండు గుర్రపు బగ్గీలు రాజమార్గాన అతివేగంగా పోతున్నాయి. మొదటి బగ్గీలో ఇద్దరు స్త్రీలు కూర్చున్నారు. ఒక యువతి సన్నగా పాలిపోయి వుంది. రెండో ఆమె సేవకురాలు, లావుగా బొదబొదలాడుతూ వుంది. ఇద్దరూ తలలకు కుళ్ళాయిలు పెట్టుకున్నారు. సేవకురాలు ఉన్ని శాలువ కప్పుకుంది. ఆమె ఎంతో ఆరోగ్యంగా అగుపిస్తోంది. నల్లటి కళ్ళను ఇటూ అటూ తిప్పుతూ, మార్గానికి ఇరువైపులావున్న పొలాలను చూస్తోంది. మధ్య మధ్య బెదురుచూపులతో తన యజమానురాలివంక దృష్టి సారిస్తోంది. ఆమెకు ఎదురుగా యజమానురాలు పడుకునివుంది. ఆమె తొడమీద కుక్కపిల్ల కాళ్ళు పై కెత్తుకుని పడుకునివుంది.

యజ మానురాలు చేతులు ముడుచుకుని రొమ్ముల మీద పెట్టుకుంది. కళ్ళు మూసుకుంది. వెనుక ఆనుడు దిండ్లకు తల చేరగిల వేసుకుంది. ఆమె తలకుపెట్టుకున్న కుళ్ళాయి తెల్లగా ధగధగ మెరుస్తోంది. మెడకు పల్చటి రుమాలుకూడా చుట్టుకుంది. ఆమె శరీరం చాలా మృదువుగా, సున్నితంగావుంది. మొహం వాడినట్లు కనిపిస్తోంది. ముడుచుకుని పడుకోవడంవల్ల ఆమె తొడుక్కున్న కోటుముడతలుపడింది. తనలో తాను ఏదో బాధ పడుతోంది. మెల్లగా దగ్గుతూవచ్చేదగ్గును ఆపుకుంటోంది. బలీయమైన వ్యాధితెరలలో ఆమె సౌందర్యం మరుగుపడివుంది.

నౌకరు తొట్టిలో కూచుని కునికిపాట్లు పడుతున్నాడు. అది నాలుగుగుర్రాల పెద్దబగ్గీ. బండితోలేవాడు పెద్దగా అరుస్తూ గుర్రాలను అదలిస్తున్నాడు. గుర్రాలు చెమటలు కక్కు తున్నాయి. రహదారి చాల వెడల్పుగావుంది. అయినా రెండు బండ్లూ ఒకదానిసరసన ఒకటి పోవడంలేదు. రెండో బగ్గీ కొంచెం వెనకాల వస్తోంది. రెండోబండి తోలేవాడు మొదటిబండివాణ్ణి పిలుస్తున్నాడు మొదటివాడు మధ్యమధ్య వెనక్కు తిరిగిచూస్తు న్నాడు. చల్లనిగాలి అంతటా వీస్తోంది. పొలాలు, రోడ్డు, తడి తడిగా, తేమగావున్నాయి. జబ్బులోవున్న స్త్రీ మెల్లగా కళ్ళు తెరిచి చూచింది. ఆమె నేత్రాలు నల్లగా, అతివిశాలంగా వున్నాయి. ఎక్కడలేని సౌందర్యం ఆ కళ్ళల్లో కనిపిస్తూవుంది.

'అబ్బ! మళ్ళీ?' అంది ఆమె నీరసంగా. కొంచెం సర్దు కుని కూచుందామనుకుంది. ఆమె పెదవులు ఏదోబాధతో వణికిపోయాయి. కాళ్లు చాపడానికీ ముడుచుకోడానికీ కూడా ఆమెకు తగిన శక్తి లేదు. వెంటనే సేవకురాలు 'మెత్రేషా' తన బట్ట సర్దుకుంటూ లేచి ముందుకువచ్చి కూర్చుంది. యజమాను రాలు తన రెండుచేతులు ఆధారంగా చేసుకుని, లేచి కొంచెం ఎత్తుగ కూచోడానికి ప్రయత్నించింది. కాని ఖలహీనంవల్ల సాధ్యంకాలేదు. అందుకోసం ఆమె పడిన బాధ అంతా ఇంతా కాదు. మొహం వికృతంగా మారిపోయింది. పళ్లు బిగబట్టింది. కళ్ళల్లో తీవ్రమైన బాధ గోచరిస్తోంది. 'కొంచెం సహాయం చెయ్యి...వద్దువద్దు. నేనే ఎలాగో తంటాలుపడతానులే. ఈ సామానుమాత్రం నామీద పడకుండా చూడు! నీవు నన్ను ముట్టుకోకుండావుంటే అదే పదివేలు...' అంటూ ఆమె మరొక

సారి కళ్ళుమూసుకుంది. అంతలో ఆమెకు దగ్గు తెరవచ్చింది. ఒక ప్రక్కకు ఒత్తిగిలి రెండుచేతులతో ఎదురొమ్ముపట్టుకుని దగ్గనారంభించింది. అలా కొంతసేపు బాధపడిపనిమనిషి దగ్గు తెరనుంచి తేరుకుంది. మళ్ళీ ఆమె కళ్లు మూసుకుని నిశ్చలంగా కూచుంది. ఆ రెండుబగ్గీలూ ఒక గ్రామంలో ప్రవేశించాయి. మెత్రేపా తను కప్పుకున్న శాలువలోంచి చేతిని బయటికి తీసుకుని క్రాస్ చేసుకుంది.

'ఏమిటది?' అడిగింది యజమానురాలు.

'పోస్టు స్టేషన్ అమ్మగారూ.' సేవకురాలుజవాబు చెప్పింది.

'అదికాదు. నీవెందుకు క్రాస్‌చేసుకున్నావని అడుగుతున్నా.'

'ఓ! అదా! ఇక్కడొక చర్చి ఉన్నది అమ్మగారూ.'

అప్పుడా అవిటిమనిషి అయిన యజమానురాలు కిటికీలోంచి గ్రామంలోవున్న పెద్ద చర్చివైపుచూచింది. మెల్లగా చెయ్యి పైకెత్తి క్రాస్‌చేసుకుంది. బండిపోతూనే వుంది.

ఆ రెండు బగ్గీలూ పోస్టు స్టేషన్ వద్దకు వచ్చి ఆగాయి. రెండో బండిలోంచి ఆ వ్యాధిగ్రస్తురాలి భర్త ఒక డాక్టరు దిగారు. మెల్లగా మొదటి బండివద్దకు వచ్చారు. డాక్టరు ఆమె నాడి చూస్తూ ఇలా అడిగాడు.

ఎలా వుంది?'

అంతలో ఆమె భర్తకూడా దగ్గరికొచ్చి కుశల ప్రశ్నలు వేశాడు.

'ఏం డార్లింగ్! ఎలావుంది వంట్లో? ప్రయాణంలో బడలిక కలిగిందా? బాడి దిగి బయటికి కొస్తావా?' అతను ఆమెను ఫ్రెంచిభాషలో అడిగాడు.

వారిద్దరూ సంభాషించేటప్పుడు తను ఆటంకంగా లేకుండా, మెట్రేషా, బాడ్లో ఒక మూలకు ఒదిగి కూచుంది.

'మామూలుగానే వుంది. మరేం విశేషంలేదు, నేను బండిలోనే కూచుంటాను.' అంది వ్యాధిగ్రస్తురాలు తన భర్తతో.

ఆమె భర్త కొంతసేపు అలాగే నిలబడి తరువాత అక్కణ్ణుంచి 'స్టేషన్ హౌస్'కు వెళ్ళాడు.

మెట్రేషాకూడా బండ్లోంచి గభాలున దూకి ఆయన వెంట పరుగెత్తింది.

నేలు ముందంతా బురదగా వుండటంచేత ఆమె తన బట్టలు పైకెగబట్టుకుని మునివేళ్ళమీద నడుస్తూ వెళ్ళింది.

డాక్టరు ఇంకా బాడిదగ్గరే నిలబడి జబ్బుగావున్న యజమానురాలుతో మాట్లాడుతున్నాడు.

'నాకు నుస్తీగా వుందని, మీరు భోజనం మానుకోవడమేమిటి? అర్థం లేదు' అంది ఆమె డాక్టరుతో. అలా అనేటప్పుడు ఆమె పెదవులమీద బాధతో కూడిన చిరునవ్వు కనిపించింది.

డాక్టరు గబ గబా "స్టేషన్‌హౌస్"లోకి వెళ్ళిపోయాడు. అప్పుడామె తనలో ఇలా అనుకుంది: 'నన్నుగురించి ఆలోచించేవాళ్ళు ఎవరూలేరు. నేనెంత బాధపడుతున్నానో వాళ్ళకేం తెలుస్తుంది? నా విషయం వాళ్ళకేం పట్టింది? అవును.

వాళ్ళ సుఖం వాళ్ళు చూచుకుంటున్నారు. ఎన్ని బాధలు పెడు తున్నావురా భగవంతుడా!

స్టేషన్ హాల్లో ఆమె భర్త డాక్టరును కలుసు కున్నాడు.

'భోజనానికి ఆర్డరిచ్చాను ఎడ్వర్డు ఇవానిచ్ ఒక బుట్టలో పెట్టి ఇస్తాడు. మనం తీసుకపోవచ్చు. ఏమంటావు!' అడిగాడు ఆమె భర్త, డాక్టరును.

'బాగుంది అలాగే చేద్దాం.' అన్నాడు డాక్టర్.

'ఆమె వంట్లో ఎలావుంది? నిట్టూర్పు విడుస్తూ ఆయన మళ్ళీ అడిగాడు.

'ఇదివరకే చెప్పానుగా. ఆమె ఇటలీ చేరుకోవడం కష్టం. ఇటలీదాకా ఎందుకూ? దేవుడు చల్లగా చూడబట్టి మాస్కో దాటి ఇంతదూరం రాగలిగాం. లేకపోతే ఈపాటికే ప్రమాదం జరిగేది. అందులోనూ ఈగాలి చూడండి. ఇదేమాత్రం ఆమె వంటికి మంచిదికాదు.' అన్నాడు డాక్టర్.

'అయితే ఇంతకూ ఏంచేద్దామంటారూ? ఆరి దేవుడా! ఎంత చిక్కు తెచ్చిపెట్టారా?' అంటూ ఆయన రెండు చేతు లతో మొహాన్ని కప్పుకున్నాడు.

అంతలో హోటలువాడు, భోజనపదార్థాలు ఒక బుట్టలో పెట్టుకుని తెచ్చాడు.

'చేసేదేముంది? ఆమెను ఇంటివద్ద వుంచడమే శ్రేయ స్కరం.' అన్నాడు డాక్టర్ తిరిగీ.

'మీరు చెప్పింది నిజమే. కాని నన్నేంచేయమంటారు? ఆమెను ఇక్కణ్ణుంచి కదలకుండా వుంచడానికి నా శాయశక్తులా

ప్రయత్నించాను. ఇంటినుంచి బయలుదేరడంవల్ల నాకెన్ని విధాలనష్టమో చూడండి. పిల్లలున్నారు వాళ్ళను చూచేవారెవరు? బోలెడు ఖర్చవుతుంది, పోతే నావ్యాపారం ఎంతో దెబ్బతింటుంది. ఎన్నో లావాదేవీలున్నాయి. ఇవన్నీ ఎవరు చూస్తారు? ఈ విషయాలన్నీ ఆమెకు చెప్పాను. నచ్చచెప్పడానికి విశ్వప్రయత్నంచేశాను. కాని ఆమె వింటేనా? ఆరోగ్యవంతురాలికిమల్లే విదేశాలకు ప్రయాణం పెట్టుకుంది. ఎంత చెప్పినా వినకపోయె. ఏం చేయమంటారు? ఈ దూరప్రయాణం తన ప్రాణాలకు ముప్పుతెస్తుందని ఆమె కాస్తయినా అర్థం చేసుకోవడంలేదు.'

'మీరింకా ఒక విషయం గమనించడంలేదు. ఆమె ఆరోగ్యం ఇదివరకే పూర్తిగా చెడిపోయింది. ఈ ప్రయాణం చేయకపోయినా ఆమె స్థితి బాగుపడుతుందని నాకుతోచదు. వాసిలీ డిమిట్రిచ్! ఒకమాట చెప్తాను వినండి. ఏ మనిషి అయినా ఊపిరితిత్తులులేకుండా బ్రతుకగలడా? ఆమె ఊపిరితిత్తులు పూర్తిగా చెడ్డాయి, కొత్తవి పెరగడానికికూడా సావకాశంలేదు. మరి ఏంచేయాలనేది, నాకుకూడా కఠినమైన సమస్యే. మీరూ - నేనూ, మనిద్దరి కర్తవ్యంకూడా, ఆమెకు వీలైనంత విశ్రాంతి, హాయి, కలిగేలా చూడడమే. కనుక మత గురువును పిలిపించండి. దైవప్రార్థనలు చేస్తాడు. అదే చివరి మెట్టు. అంతకన్న గత్యంతరంలేదు'

'ఓ! ఈశ్వరా! ఎన్ని చిక్కుసమస్యలు తెచ్చిపెట్టావు! ఆమె విషయం తలుచుకుంటే నాగుండె తరుక్కుపోతోంది. ఏం చేయను? ఆమెలాంటి మనిషి మళ్ళీ జన్మలో చూడను...'

'సరే. రోడ్డు సరిగాలేదు ముందామెకు ప్రయాణంలో ఇబ్బంది కలగకుండా చూడండి. ఈ రోడ్డు దాటితే తరువాత సరు గుడుంబండ్లమీద పోవచ్చు. లేకపోతే దోవలోనే ప్రమాదం సంభవించవచ్చు.' అన్నాడు డాక్టర్.

అంతలో స్టేషన్‌మాస్టరు కూతురు బురదలో పరుగెత్తుకుంటూ అక్కడికొచ్చింది.

'అక్స్యూషా, ఓ అక్స్యూషా! రావే! ఆజబ్బుమనిషిని చూచివద్దాం. ఆమెకు ఊపిరితిత్తులు చెడిపోయాయట. విదేశాలకు తీసుకెడుతున్నారు. క్షయరోగులను ఇంతవరకు నేనెప్పుడూ చూడ్లేదే. రా! వెళ్ళదాం' అంటూ ఆమె ఒక ఇంటివాకిట్లో నిలబడివున్న స్నేహితురాల్ని పిలిచింది. వెంటనే ఆపిల్ల కూడా పరుగెత్తుకుంటూ వచ్చింది. ఇద్దరూ కలిసి ఆజబ్బు మనిషిని చూడ్డానికి వెళ్ళారు.

బగ్గీ నిలబడివున్న చోటుకు వెళ్ళి, కిటికీలోంచి లోపలకి తొంగిచూచారు. అప్పుడా వ్యాధిగ్రస్తురాలు వారు తనను చూడ్డానికి కుతూహలపడుతున్నారని గ్రహించింది. వెంటనే కనుబొమలు ముడియపెట్టి, మొహం అవతలికి తిప్పుకుంది.

'ఒక్సేయ్! ఆమె ఎంత అందంగావుందో చూడు. పాపం, ఇలాంటి ఆవిడకు ఈరోగం ఎక్కణ్ణించి వచ్చిందే తల్లీ! చూచావుటే అక్స్యూషా!' స్టేషన్ మాష్టరు కూతురు తన స్నేహితురాల్ని అడిగింది.

'అవును, చాల అంతగత్తె. మనల్ని చూచి మొహం తిప్పేసుకుందే! నీళ్ళకు పోతున్నట్లుగా అటువైపు పోయి మరోమాటు చూద్దాం పద' అంది స్నేహితురాలు.

ఇద్దరూ పరుగెత్తుకుంటూ గేటువైపు వెళ్ళారు.

'నేను నిజంగా చూడ్డానికి భయంకరంగా వున్నాను. అందుకేవాళ్ళు నన్ను చూచి పారిపోతున్నారు. విదేశాలకు వెడితే అయినా, నా ఆరోగ్యం బాగుపడిపోతుందా! అనుకుంది జబ్బుమనిషి తనలో.

'ఎలావుంది డియర్ ?' ఆమెభర్త అక్కడికివస్తూనే, అడిగాడు. అతను ఏదో నోట్లో వేసుకుని నములుతున్నాడు.

'ఎలావుంది? ఎలావుంది? ఎప్పుడడిగినా అదేప్రశ్న. ఆయనమాత్రం ఏదో తింటూ కులాసాగా వున్నాడు.' అనుకుంది ఆమె తనలో. 'అలాగే వుంది.' అంది భర్తతో.

'చూడు. గాలి బాగాలేదు. ఈ గాలిలో ప్రయాణం చేస్తే నీకు ఏమవుతుందో అని నాకు భయంగా వుంది. డాక్టరు కూడా అదేమాట అన్నాడు. పోనీ వెనక్కితిరిగి ఇంటికి వెడితే ఏం?'

భర్తమాట వినేసరికి ఆమెకు కష్టం కలిగింది. జవాబు చెప్పకుండా ఊరుకుంది.

'ఇంకా కొంతదూరంపోతే, అప్పటికైనా గాలి మారుతుందేమో. సరుగుడు బండిమీద ప్రయాణంచేయడానికి వీలు కలిగితే, అందరం కలిసిపోవచ్చు. అప్పుడు నీకింత బడలిక వుండదు' అన్నాడు ఆయనమళ్ళీ.

'నామాట మీరు విన్నారుకాదు. నేను చెప్పినప్పుడే బయలుదేరివున్నట్లయితే ఈపాటికి బెర్లిన్ అయినా చేరేవాళ్ళం. నా ఆరోగ్యం బాగుపడేది.' అంది ఆమె.

'నన్నేం చేయమంటావు డియర్? చూస్తున్నావుగా మన ఇబ్బందులు. నా వ్యాపారం ఎంతదెబ్బతిన్నదో నీకు తెలుసు. ఇంకొక నెల నీవు ఓపికపట్టినట్లయితే పనులన్నీ చక్కబెట్టుకునేవాణ్ణి. పిల్లల్నికూడా మనతో తీసుకెళ్ళడానికి వీలుండేది.' అన్నాడాయన.

'పిల్లలు ఆరోగ్యంగా వున్నారు. మరి నేను అవిటిదాన్ని. వాళ్ళకూ నాకూ పోలేమిటి?'

'కాదు డియర్! గాలి ఏమాత్రం బాగాలేదు. రోడ్డు చూడబోతే ప్రయాణానికి అనుకూలంగాలేదు. నీ పరిస్థితి మరీ విషమిస్తుందేమో అని భయంగావుంది...పోనీ ఇంటికివెడితే కొంత నయమేమో?'

'ఇంటికివెళ్ళి ఏంచేయడానికి?...చావడానికేగా?' అన్నదామె. 'చావు' అనేమాట ఆమె నోట్లోంచి వచ్చేసరికి ఎంతో బాధ పడింది. మొహం వికృతంగా, భయంకరంగా మారిపోయింది. భర్తవంక ఏదో ప్రశ్నార్థకంగా చూచింది. చంటిపిల్ల మాదిరి నోరు తెరిచింది. ఆమె కళ్ళనుండి అశ్రువులు జలజలమని రాలాయి. ఆమె భర్త తల రుమాలుతో మొహాన్ని కప్పుకున్నాడు. మాట్లాళ్ళేక అక్కణ్నుంచి మెల్లగా అవతలికి వెళ్ళిపోయాడు.

'ఓ ఈశ్వరా! నాగతి ఏం కానున్నది?' అంటూ ఆమె ఆకసంవంకచూస్తూ భగవంతుణ్ణి ప్రార్థించింది. ఆమె నేత్రాల నుండి అశ్రువులు రాలి, చెక్కిళ్ళమీదపడి జారిపోతున్నాయి. అలా ఎంతోసేపు ప్రార్థించింది. కాని ఆమెకు గుండెల్లోపోటు ఎక్కువయింది. ఊపిరిపీల్చడం కష్టమయింది. ఆకాశం, చుట్టూ

పొలాలు, రోడ్డు; అన్నీ బూడిదవర్ణంగా అగుపిస్తున్నాయి. అంతా తేమగావుంది. రోడ్డుమీదపోతున్న బండ్లచప్పుడు, గుర్రపుడెక్కల సవ్వడి, చెవులలో గింగురుమంటున్నాయి. కొందరు బండ్లవాండ్లు, తమ బండ్లు నిలబెట్టుకుని, గుర్రాలకు దాణా వేస్తూ, చక్రాలకు తారుపూసుకుంటూ, ఒకరితో ఒకరు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ నవ్వుతూ పేలుతూ ఆనం దిస్తున్నారు.

## 2

బండి ప్రయాణానికి సిద్ధంగావుంది. కాని బండితోలే వాడు రాలేదు; అతను పెత్తనాలు చేస్తున్నాడు. స్టేషన్ ప్రక్కన బండ్లవాండ్లు విశ్రాంతి తీసుకునే పాక ఒకటి వుంది. అతను అక్కడికి వెళ్ళాడు. ఆ పాకలో వెచ్చగావుంది. చీకటిగాకూడా వుంది. అందులోనే బండ్లవాండ్లు రొట్టెలు, ఫలహారాలు తినడం భోజనంచేయడం జరుపుతుంటారు. రాత్రి, పగలుకూడా అక్కడే పడుకుని విశ్రాంతి తీసుకుంటారు. పాకలో చాలమంది బండ్ల వాండ్లు కూచుని వున్నారు. వంటమనిషి ఒకమూల పొయ్యివద్ద కూచుని ఫలహారాలు తయారు చేస్తోంది. ఎత్తుగావున్న పొయ్యి అరుగుమీద, ఒక జబ్బుమనిషి గొంగడి కప్పుకుని పడు కున్నాడు.

'బాబాయి! ఓ బాబాయి!! నిన్నే నేపిలిచేది.' అన్నాడు వయసులోవున్న బండివాడు, జబ్బుమనిషిని చూస్తూ.

'ఏం కావాలోయ్ నీకు? థియోడర్‌కు వంట్లో బాగా లేదు. అదుగో నీ బండి నిలబడివుంది. తోలుక పోరాదూ?' అన్నాడు అక్కడున్న వాళ్ళలో ఒక్కడు.

'నాకు ఆయన బూడ్సులు కావాలి. నా బూడ్సులు బొత్తిగా చిరిగి పాడయి పోయినాయి. ఏం? ఆయన నిద్ర పోతున్నాడా? థియోడర్ బాబాయి!' అంటూ బండివాడు మళ్ళీ అతన్ని లేపాడు.

'ఎవరు?' నీరసంగా ప్రశ్నించాడు జబ్బుతోవున్న ఆ వృద్ధుడు. అతని చొక్కా పూసి పోయి మకిలపట్టివుంది. పొడుగ్గా పెరిగిన గడ్డం; వెంట్రుకలు బూగి వర్ణంలో వున్నాయి. మొహం పల్చగా పాలిపోయి వుంది. దౌడలులోపలికి పీక్కుపోయాయి.

'కాసిని మంచినీళ్ళు ఇవ్వరా నాయనా!......ఎందుకు పిలిచావు?' అడిగాడు వృద్ధుడు మళ్ళీ. బండివాడు ఒక ముంతతో అతనికి మంచినీళ్ళు అందించాడు.

'చూడు బాబాయి! నాబూడ్సులు చిరిగి బదాబదలయినాయి. నీవు కొత్త బూడ్సులు కుట్టించుకున్నావు కదూ? అవి నాకు ఇచ్చె బాబాయి! నీవు వాటిని తొడుక్కోడం లేదాయె. నీవసలు తిరిగే స్థితిలో లేవుగా! బూడ్సులు లేనందువల్ల నాకు చచ్చె ఇబ్బందిగావుంది బాబాయి.' అన్నాడు బండివాడు.

జబ్బుతోవున్న వృద్ధుడు ఎంతో కష్టమీద పక్కకు ఒత్తిగిలాడు. మెల్లగా మంచినీళ్ళు తాగాడు. నీళ్ళు తాగుతోంటే అతని మీసాలు సాంతం నీళ్ళలో మునిగాయి. అతని

కళ్ళు లోతుగా గుంజుకపోయివున్నాయి. చూపు సరిగా ఆనడం లేనందున, అతను యువకుడి మొహాన్ని తేరిపారచూడ్లేక పోయాడు. మంచినీళ్ళు తాగి, తడిగావున్న మీసాలుచేత్తో సరిచేసుకోడానికి యత్నించాడు. కాని బలహీనంవల్ల అతని చెయ్యిలేవలేదు. అందుకని కప్పుకున్న గొంగడికి మీసాలు రుద్దుకున్నాడు. బరువుగా ఊపిరి పీలుస్తున్నాడు. మెల్లగా, లేని బలాన్ని తెచ్చుకుని కళ్ళు పైకెత్తి ఆ యువకుడి మొహం లోకి చూచాడు. అతని కళ్ళు పుసులుకట్టి, పొరలుకమ్మి వున్నాయి.

'మాట్లాడవేం బాబాయ్? నీ బూడ్సులు మరెవరికైనా ఇస్తానని మాట ఇచ్చావా? అలా జరిగివుంటే చెప్పేసెయ్. అసలు విషం ఏమిటంటే, బూడ్సులు లేనందున నాకు చాలా ఇబ్బందిగా వుంది. బయట ఎక్కడచూచినా తేమ బురద —— నాకేమో పనికిపోక తప్పదాయె. నడవడం కష్టంగావుంది. పోనీ మీబాయిదగ్గర కొత్తబూడ్సు లున్నాయికదా! అతనికి వాటిత్తో ఇవ్వడేం పనిలేదు. ఇస్తాడేమో అడుగుదాం' అను కున్నాను. అందుకే వచ్చాను, వాటిత్తో నీకు అవసరముంటే చెప్పేసెయ్. నా తిప్పలు నేను పడతాను.' అన్నాడు మళ్ళీ బండివాడు.

జబ్బుతో వున్న వృద్ధుడి గొంతులో ఏదో గురగురలా డడం మొదలెట్టింది. అతను ఖళ్ళుఖళ్ళు మని దగ్గడం ప్రారంభించాడు.

'ఆ ముసలాడి కిక బూడ్సు లొకశే తక్కువ. అకస్మాత్తుగా అరిచింది వంటమనిషి 'నెలరోజులకు పైన అయింది.

ఆ ముసలాడు మూలపడి అరుగుమీదనుంచి దిగడమే లేదు. ఒక క్షణం ఊపిరిసలపడంలేదు. వినేవాళ్ళం మేమే ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నాం. అలాంటి వాడికి బూడ్సులెందుకు? పూడ్చి పెట్టేటప్పుడు కొత్తబూడ్సులతో పూడ్చిపెట్టరుకదా! పాపం ఆ ముసలాడు ప్రాణాలుపోక కొట్టుకుంటున్నాడు. ఈ దగ్గు విన లేక, అతనిబాధ చూళ్ళేకనాదుంప తెగుతోంది. ఈ పాకలో సగం జాగా అతనే ఆక్రమించాడు. నాకా వేరే జాగాలేదు. అతన్ని మరోచోటిమార్చమని ఎంత మొత్తుకున్నా, ఒక్కరైనా నామాట వినిచస్తేనే? పట్నంలో ఆసుపత్రు లున్నాయని చెప్తు తున్నారుగా? తీసుకుపోకూడదూ? అబ్బబ్బ! ముందు నాచావు కొచ్చింది. పాకఅంతా అతనిమూలాన అసహ్యమై పోయింది. పైగా శుభ్రంగా వుండాలని అందరూ మాటలు చెప్తూతారు. ఏం శుభ్రంగావుంచేది నాబొంద? అంటూ వంటమనిషి పాక ఎగిరిపోయేట్టుగా అరిచింది.

ఏయ్ సెర్జి! ఆ పెద్దమనుషులు నీకోసం కనిపెట్టుకుని వున్నారు. వెళ్ళి బండి తోలుకుపో!' అంటూ బండ్ల వాండ్ల మీద పెత్తనం చేసే 'ఓవర్ సిర్' పెద్దగా కేక వేశాడు.

సెర్జి వృద్ధుడుచెప్పే సమాధానం వినకుండానే వెళ్ళిపో దామను కుంటున్నాడు. కాని అంతలోముసలాడు ఖళ్ళుఖళ్ళున దగ్గుతూనే సెర్జి వంక చూచాడు. అతనిచూపుల్లో ఏదోజవాబు చెప్పయత్నిస్తున్నట్లు తెలుస్తోంది.

'నాబూడ్సులుతీసుకో సెర్జి' ఎంతోప్రయాసపడి జవాబు చెప్పాడు వృద్ధుడు. దగ్గును ఆపుకుని ఒకక్షణం వుండి మళ్ళీ ఇలా అన్నాడు. 'సెర్జి!......ఒకమాట...నేను చచ్చిన తరు

వాత నా మీాద ఒక శిలువ పాతించు నాయనా! అంతకన్నా నేను కోరేది లేదు.'

'అలాగే బాబాయి! నీ బూడ్సులు తీసుకుంటాను. నీ కోసం తప్పకుండా ఒక శిలువ చేయిస్తానులే' అన్నాడు సెర్జీ.

'అబ్బాయిలూ! అతను చెప్పేది మీారంతా వింటున్నారుగా' అడిగాడు వృద్ధుడు అక్కడున్న తక్కినవాళ్ళను ఉద్దేశిస్తూ.

అతనికి మళ్ళీ దగ్గు తెరవచ్చింది. ఊపిరి ఆడకుండా దగ్గుతున్నాడు.

'విన్నాం.' అన్నాడు వారిలోంచి ఒక బండివాడు. "సెర్జీ ఇహ నీవు వెళ్ళవోయ్! ఓవర్‌సీర్ మళ్ళీ నీకోసం వస్తున్నట్టున్నాడు. ఆ పెద్దమనుషులు తొందరపడుతున్నారు. ఆ అమ్మగారికి జబ్బుగావున్న సంగతి నీకు తెలీదూ. త్వరగా వెళ్ళు.' అన్నాడు తిరిగీ రెండో బండివాడు.

సెర్జీ. గబగబా తన చిరిగిపోయిన బూడ్సులు ఊడదీసి అక్కడున్న బెంచీక్రింద పడేశాడు. థియోడర్ కొత్తబూడ్సులు తీసుకొని త్వరత్వరగ తొడుక్కున్నాడు. అవి అతనికి సరీగ్గా సరిపోయినాయి. తొడుక్కున్న బూడ్సులవైపే చూస్తూ చకచకా బండిదగ్గరకు వెళ్ళాడు. 'ఎంతచక్కని బూడ్సులు! వాటికి తారు పూశావూ అంటే ఇంకా మెదక్కుదలాడుతూ మెరిసిపోతాయి. అతగాడు నీ కివి ఊరికనే ఇచ్చాడటోయ్?' అన్నాడు మరో బండివాడు. సెర్జీ, బండిమీాదికెక్కి తొట్లో కూచున్నాడు.

'నీ కెందుకోయ్ కళ్ళమంట? నీ సొమ్మేం కాదుగా?' అని సెర్జీ సమాధానం చెపుతూ పగ్గాలు పట్టుకుని గుర్రాల్ని

అదిలించాడు. తడిరోడ్డుమీద బండి చరచర వెళ్ళిపోయి అదృశ్యమైంది.

జబ్బుతో వున్న ముసలాడు ఆ బండ్లవాళ్ళ పాకలో అరుగుమీద పడుకుని యమయాతన అనుభవిస్తున్నాడు. దగ్గు అతని ప్రాణాలు తీస్తోంది. బాగున్న రోజులలో అతనూ బండి తోలేవాడే.

ఎంతోకష్టంమీద అతను అవతలి పక్కకు ఒత్తిగిలి మాట్లాడకుండా పడుకున్నాడు. రాత్రి పొద్దుపోయేంతవరకూ పాకలోకి జనం వస్తూ పోతూవున్నారు. భోజనాలు, ఫలహారాలు; ఏవి కావల్సిన వారు అవి తిని పోతున్నారు. ముసలాడు ఉలకడంలేదు, పలకడంలేదు. రాత్రి పొద్దుపోయింతరువాత వంటమనిషి అరుగుమీదికి ఎక్కింది. అక్కడ తన ఉన్నికోటు వుంటే దాన్ని ఇవతలికి లాగింది. కాని అలా చేయడంలో ముసలాడి వంటికి తగిలి నొప్పిపుట్టింది.

'ఏమిటి నస్తాష్యా! నావళ్ళంతా పచ్చిపుండులావుంది. నన్ను కదిలించకు తల్లీ! నీకు పుణ్యముంటుంది. త్వరలోనే ఇక్కడ నుంచి పోతానులే.' అన్నాడు ముసలాడు మెల్లగా.

'ఓ! చూళ్ళేదు బాబాయ్! ఏమిటి? నీ వంట్లో ఎట్లా వుంది?' అడిగింది వంటమనిషి నస్తాష్యా.

'ఎట్లావుందని చెప్పేదమ్మా! వళ్ళంతా గుల్లయిపోయింది. ఈ రోగం ఏమిట్లో ఆ ఈశ్వరుడికి తెలియాలి.'

'నీవు అస్తమానం అలా దగ్గుతూవుంటే గొంతు నొప్పిగా వుందేమో బాబాయి!'

'ఒక గొంతు ఏమిటమ్మా! ప్రతి అవయవం బాధ పెడుతూనేవుంది. నాకు అవసాన దశ ఆసన్నమైంది-- అందుకే ఈ యాతన. ఓ! ఓ! ఓ దేవుడా!' అంటూ వృద్ధుడు వాపోయాడు.

'కాళ్ళమీద సరిగా గుడ్డ కప్పుకో బాబాయి.' అంటూ ఆమె గొంగడి అతని కాళ్ళమీద సరిగా కప్పింది.

పాకలో సన్నగా దీపం వెలుగుతోంది. వంటమనిషి నస్టాస్యా, మరో పదిమంది బండ్లవాళ్లు; పాకలో పడుకున్నారు. కొందరు బెంచీలమీద, మరికొందరు నేలమీద పడుకుని గుర కలు పెడుతున్నారు; ముసలాడు తెల్లవార్లూ మూలుగుతూ, దగ్గుతో బాధపడుతున్నాడు. తెలతెలవారుతూండగా క్రమ క్రమంగా సద్దుమణిగింది. అతను చప్పుడిలేకుండా పడుకున్నాడు.

ఉదయాన్నే నస్టాస్యా నిద్రలేస్తూ 'రాత్రి నాకో చిత్ర మైన కల వచ్చింది'? అని చెప్పసాగింది. 'థియోడర్ బాబాయి నెగడిమీదనుంచి క్రిందికి దిగి కట్టెలు కొట్టడానికి వెళ్ళాట్ట. 'రా నస్టాస్యా! నీకు కాస్త సహాయం చేస్తాను.' అంటూ గొడ్డలి తీసుకొని గబగబా కట్టెలు పగులగొట్టసాగాడు. 'ఏం బాబాయ్! నీ వంట్లో బాగాలేదుకదా?' అని అడిగాను నేను. 'ఓ బాగానేవుంది.' అన్నాట్ట ఆయన. అలా అంటూ గొడ్డలిని పైకెత్తి అటూ ఇటూ ఊపాడు. నాకు భయంవేసి పెద్దగా కేక పెట్టానట. అంతలో మెలకువ వచ్చింది. ఏమిటో ఈ కల? బహుశా థియోడర్ చచ్చిపోయివుండడు కదా?' అంటూ ఆమె వృద్ధుణ్ణి పిలవసాగింది.

'బాబాయ్ ! థియోడర్ బాబాయ్ !'

ఊహు జవాబు రాలేదు. 'దగ్గరికి వెళ్ళి చూస్తాను.' అంటూ లేచి అతన్ని సమీపించింది నస్తాస్యా.

అంతలో ఒక బండివాడుకూడా నిద్ర లేచాడు. వెళ్ళి చూచేసరికి ముసలాడు ఒక చెయ్యి ప్రక్కకు వ్రేలాడేసుకుని కదలకుండా పడివున్నాడు. చెయ్యి నీలుక్కుపోయి చల్లగా వుంది.

'వెళ్ళి స్టేషన్ మాస్టరుతో చెప్తాను, ముసలాడు చచ్చి నట్లుంది.' అన్నాడు బండివాడు.

థియోడర్‌కు బంధువు లెవరూ లేరు. ఎక్కడో దూరప్రాంతాలనుంచి బ్రతకడంకోసం అక్కడికొచ్చాడు. మర్రోజు వాళ్ళు అతని శవాన్ని, మోసుకపోయి అడివి అవతలనున్న కొత్త స్మశానంలో పూడ్చిపెట్టారు. తనకువచ్చిన కలనుగురించి నస్తాస్యా చాలరోజులవరకూ కనిపించిన వారందరితోనూ చెపుతూవచ్చింది. అతను చచ్చిపోతాడనే సంగతి తనొక్కదానికే ముందు తెలుసునని ఆమె గర్వంగా చెప్పుకునేది.

## 3

వసంతఋతువు వచ్చింది. పురవీధులనిండా నీరు ప్రవహిస్తోంది. ఎక్కడెక్కడి చెత్త, చెదారం నీళ్ళతోపాటు కొట్టుకొస్తోంది. వీధుల్లో జనం తిరుగుతూవుంటే, వారు కట్టుకున్న రంగురంగుల దుస్తులు, స్ఫుటంగా అగుపిస్తున్నాయి. వారి కంఠస్వరాలు కీచుకీచుమని వినిపిస్తున్నాయి. తోటల్లో, తోపుల్లో,

సర్వత్రా; చెట్లలో నూతనత్వం వెల్లివిరుస్తూవుంది. ప్రకృతి అంతా వసంతశోభతో కళకళలాడుతూవుంది.

పిచ్చుకలు కిచకిచలాడుతూ, వికృతంగా రెక్కలు ఆడిస్తూ అటూ ఇటూ ఎగురుతున్నాయి. చక్కని సూర్య కాంతి వీధులలోను, ఇండ్లమీదా, గోడలపైన, గొబ్బెలమీద, చెట్లపైనపడుతూ వింతశోభను వెదజల్లుతోంది. ప్రతి అణువు లోనూ, ఏదోచలనం, చైతన్యం, మెరుస్తోంది. భూమి, ఆకాశం మానవహృదయం; అన్నిట్లోనో నవయౌవ్వనం, మహదానం దం తొణికిసలాడుతున్నాయి.

ఒక విశాలమైన వీధిలో ఒక పెద్ద ఇల్లు కనిపిస్తోంది. ఆ ఇంటిని చూడగానే అదొక ప్రముఖవ్యక్తికి చెందినదని సుల భంగా చెప్పవచ్చు. ఇంటిముందు రోడ్డుమీద, గడ్డిపరిచివుంది. జబ్బుతో బాధపడుతోన్న ఆ యువతి, విదేశాలకు వెడుతోంటే దోవలోనే ఆమెకు చావు సమీపించింది. ఇప్పుడామెను ఆ ఇంట్లోనే పడుకోబెట్టారు.

ఆమెను పడుకోబెట్టిన గదితలుపు మూసివుంది. తలుపు దగ్గర ఆమె భర్త, మరో వృద్ధురాలు, నిలబడివున్నారు. సోఫాలో ఒక మతగురువు తలవొంచుకుని కూర్చున్నాడు. ఆయన అంగీక్రింద ఏదో చుట్టచుట్టి చేత్తోపట్టుకుని వున్నాడు. గదిలో ఒకమూల, జబ్బుమనిషి తల్లి ఒక కుర్చీలో పడుకునివుంది. ఆమె పండుముదుసలి. లేవలేని స్థితిలోవుంది. అలా కుర్చీలో పడుకుని ఆ వృద్ధురాలు దుఃఖిస్తోంది. ఆమెప్రక్కన ఒక సేవకు రాలు రుమాలు పట్టుకుని నిలబడివుంది. మరో పనిమనిషి ఆమె కణతలకు ఏదోమందు రుద్దుతూ తెలపడుతోంది.

'సరేనమ్మా. నీమీద ఆవిడకు విశ్వాసముంది. ఆమెతో ఎలామాట్లాడాలోకూడా నీ ఒక్కదానికే తెలుసు. కనుక వెళ్ళి ఎలాగైనా ఆమెను ఒప్పించు,' అన్నాడు భర్త, తన ప్రక్కన నిలబడివున్న స్త్రీతో.

ఆయన గది తలుపు తీయబోతూవుంటే ఆమె ఆపు చేసింది. తన రుమాలుతో పలుమార్లు కళ్ళమీద అద్దుకుంది.

'సరే! ఇప్పుడు నా మొహం విచారిస్తున్నట్లు కనిపించడం లేదుగా! ఇహ తలుపు తీయండి. అంటూ ఆమె లోపలికి వెళ్ళింది.

భర్త చాల ఆందోళనపడుతున్నట్లుగా అగుపిస్తున్నాడు. కుర్చీలో పడుకున్న వృద్ధురాలివద్దకు వెళ్ళబోయి, మళ్ళీ తప్పుకుని మతగురువును సమీపించాడు. మతగురువు తలఎత్తి ఆయన వంక చూచాడు. తరువాత పైకిచూస్తూ నిట్టూర్పు విడిచాడు.

'ఓ భగవంతుడా, ఓ భగవంతుడా!' అన్నాడు భర్త.

'ఏం చేయమంటారు?' అన్నాడు మతగురువు.

'ఆవిడతల్లి ఇక్కడే వుంది! ఆమె ఇది భరించలేదు. మీరైనా ఆమెను అవతలికి పంపించండి ఫాదర్' అన్నాడు భర్త.

వెంటనే మతగురువు లేచి వృద్ధురాలి వద్దకు వెళ్ళాడు. 'తల్లి హృదయం తపించిపోయేమాట వాస్తవమేనమ్మా! తప్పదుమరి. ఏం చేస్తాం?' అన్నాడు మతగురువు.

వృద్ధురాలి మొహం వికృతంగా మారిపోయింది. ఎక్కిళ్ళు పట్టి పిచ్చిగా ఏడవసాగింది. ఒక్క క్షణం ఊరుకుని మతగురువు

మళ్ళీ ఇలా అన్నాడు. మన 'మేరీ డిమిట్రెవనా, కంటె బల మైన రోగం ఇదివరకొకా మెకు వచ్చిందమ్మా. నే నెరుగుదును. ఒక సాధారణమైన వర్తకుడు ఆమె వ్యాధిని కొద్దికాలంలోనే నయంచేశాడు. ఏవో మూలికలు తెచ్చి నయంచేశాడు. అతను ఇప్పటికీ 'మాస్కో'లో వున్నాడు. ఈ విషయం వాసిలీ డిమి ట్రిచ్‌తో చెప్పాను. మనం ఆ వైద్యుణ్ణి కలుసుకుని చివరి ప్రయత్నం చేయవచ్చు. దానివల్ల కొంత అయినా సుగుణం కలుగుతుందని నా నమ్మకం. ఆ పైన భగవంతుడున్నాడు.'

'లేదు. ఇహ ఆమె జీవించదు.' అంది వృద్ధురాలు. 'దేవుడు నన్ను తీసుకపోవడానికి మారుగా దాన్ని తీసుక పోతున్నాడు. ఏం చేయను?' అంటూ ఆమె తిరిగీ వెక్కి వెక్కి ఏడవ సాగింది. ఆ ఏడుపులో ఆమెకు స్పృహకూడా తప్పింది అవును పాపం. మరణ శయ్యమీదవున్న యువతి తల్లి ఆమె. అందుకే అంతగా కుమిలిపోతున్నది.

అత్తగారి దుస్థితి చూళ్ళేక వాసిలి మొహానికి చేతులు అడ్డం పెట్టుకుని నడవలోకి పరుగెత్తాడు.

నడవలో మొదట ఆయనకు ఆరేండ్ల కొడుకు ఎదురు పడ్డాడు. ఆ పిల్లవాడి వెనకాల, అతని చెల్లెలు పరుగెత్తుకుంటూ వస్తోంది.

'బిడ్డల్ని అమ్మగారివద్దకు తీసుకెళ్ళడానికి అనుమతి ఇవ్వరూ?' పనిమనిషి, ఆయన్ను అడిగింది.

'వద్దు ఆమె, పిల్లల్ని చూడాలని కోరడంలేదు. అందు వల్ల ఆవిడ మరీ గుండె పగులుతుంది.' అన్నాడు ఆయన.

కుర్రవాడు నిలబడి ఒకక్షణం తండ్రి ముఖంలోకి తీక్షణంగా చూచాడు. పిమ్మట ఒక్క గెంతు గెంతి సంతోషంగా కేకలు పెడుతూ ఇలా అన్నాడు:

'చూడు నాన్నా! చెల్లాయి ఏం చేస్తోందో? అది గుర్రమట! నా వెంట పడుతోంది.'

ఈలోపల, గదిలో పరిస్థితి ఇలావుంది. వ్యాధిగ్రస్తురాలికి తెల్లని దుస్తులువేసి ఒక మంచమీద కూచోబెట్టారు. అటూ ఇటూ, వెనుకవైపునా ఎత్తుగా ఆనుడు దిండ్లు పెట్టారు. ఆమె ప్రక్కన బంధువురాలైన రెండో స్త్రీ కూచునివుంది. డాక్టరు కిటికీదగ్గర నిలబడి మందు తయారు చేస్తున్నాడు.

'ఓ! ఇవన్నీ నీవు నాతో చెప్పక్కర్లేదు సోదరీ! నేనేం పసిపిల్ల ననుకోకు. నేను క్రైస్తవ మతస్తురాలిని. నాకంతా తెలుసు. నాకు మరణం సమీపించిన సంగతికూడా తెలుసు. ఈపాటికి ఇటలీ చేరివున్నట్లయితే బహుశా — కాదు, తప్పకుండా నాకీ రోగం నయమయివుండేది? అంతా అదేమాట అన్నారు. ఏం చేయను? ఆయన నామాట పట్టించుకోకుకుండా జాగుచేశారు. ఇంతకూ మనం ఏస్తాం? దైవ సంకల్పం ఇలావుంది. మనమంతా ఎంతో పాపంచేసుకున్నాం. నాకు నమ్మకముంది; ఈశ్వరుడు మనపాపాన్ని క్షమించకపోడు. మనల్ని దయదలచక పోడు. కాసిబాధ ఎక్కువగావుంది సోదరీ! ఓర్పుతో భరించడానికి ప్రయత్నిస్తున్నాను....' అంది రోగి.

'అయితే, మతగురువును పిలవనా? ఆయన ప్రార్థనచేసి పవిత్రోదకం ఇస్తే నీకు మనశ్శాంతి కలుగుతుంది.' అంది బంధుగురాలు.

జబ్బుమనిషి తలవంచుకుంది. 'ఈశ్వరా! నేను మహా పాపిని. నన్ను క్షమించు' అంది ఆమె మెల్లగా.

బందుగురాలు వాకిట్లోకి వెళ్ళి మతగురువువైపు చూచింది. లోపలికి రావలసినదని సైగచేసింది.

'ఆమె ఒక దేవత!' అంది భర్తతో. భర్త అదివిని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. ఆమెకూడా కంటతడి పెట్టింది. మత గురువు రోగివున్న గదిలోకి వెళ్ళాడు.

జబ్బు మనిషి తల్లి, ఇంకా స్పృహలేకుండా కుర్చీలోనే పడివుంది. కొంతసేపు అంతా నిశ్శబ్దంగా వున్నారు. పిమ్మట మతగురువు గదిలోంచి ఇవతలికొస్తూ. 'దేవుడి దయవల్ల ఇప్పు డామె ప్రశాంతంగా పడుకొనివుంది. మిమ్మల్ని చూడాలం టోంది' అన్నాడు.

భర్త, బందుగురాలు గదిలోకి వెళ్ళారు. రోగి నిశ్శ బ్దంగా పడుకుని తనలో తాను కుమిలి కుమిలి ఏడుస్తోంది.

'ఎలావుంది డియర్! నీకు నా కృతజ్ఞత తెల్పుకుంటు న్నాను' అన్నాడు భర్త.

'థ్యాంక్స్. నాకిప్పుడెంత హాయిగావుందో చెప్పలేను. ఎన్నో మధురమైన భావనలతో నామనసు నిండిపోయింది.' అంటూ ఆమె భర్తవంక చూచింది. ఆమె పెదవులమీద ఓ చిత్రమైన చిరునవ్వు మెరిసింది. 'ఈశ్వరుడు ఎంత దయామ యుడు! కాదూ? దయామయుడు, శక్తిసంపన్నుడు!' అంటూ ఆమె మళ్ళీ భర్తవైపు చూచింది. ఆమె కళ్ళల్లో నీరు తిరిగాయి.

అకస్మాత్తుగా ఆమె తన భర్తను ఇంకా దగ్గరికి రమ్మని సైగచేసింది. 'నేను అడిగింది మీరు ఎప్పటికీ చేయరుగదూ?' అంది ఆమె నీరసంగా. భర్త ఆమెమీదికి వంగి ఇలా అడిగారు.

'ఏమిటది డియర్ ?'

'ఈ డాక్టర్లకు ఏమీ తెలీదని నేను ఎన్నోసార్లు చెప్పాను...వీళ్ళకంటె మామూలు ఆడవాళ్ళు నయం. మత గురువు చెప్పాడు. ఒక వర్తకుడున్నాట్ట......తప్పక నయం చేస్తాడు......అక్కడికి పంపరూ!'

'ఎవరిని డియర్ ?'

'ఓ దేవుడా! మీకు ఏదిచెప్పినా అర్థంకాదు!...' అంది ఆమె బాధగా. అంతలో ఆమె కళ్ళు మూతలు పడ్డాయి.

డాక్టరు వచ్చి ఆమె నాడి పరీక్షించాడు. క్రమక్రమంగా నాడి క్షీణిస్తోంది. డాక్టరు ఆమె భర్తను క్రీగంట చూచాడు. బందుగురాలు మొహం ఒకప్రక్కకు త్రిప్పి దుఃఖించసాగింది. అంతలో రోగి కళ్ళు తెరిచి చూచింది. విషయం గ్రహించి ఇలా అంది:

'ఎందుకు విచారిస్తారు? ఎవరూ విచారించవద్దు. మీరు దుఃఖిస్తుంటే నాకు బాధ మరీ ఎక్కువవుతుంది. ఈ చివర క్షణంలో అయినా నన్ను ప్రశాంతంగా కన్నుమూయనీయండి.

'నీవు నిజంగా దేవతవు!' అంటూ బందుగురాలు ఆమె చేతిని ముద్దిడసాగింది.

'అలా కాదు. ఇక్కడ ముద్దుపెట్టుకో. చచ్చిపోయే వారి చేతిమీదమాత్రమే ముద్దుపెట్టుకోవడం ఆచారం!' అంది రోగి తిరిగి తన చెయ్యిని చూపిస్తూ.

ఆ రాత్రికే ఆమె స్వర్గస్తురాలయింది. ఆమెను ఒక పెద్ద శవపేటికలో పడుకోబెట్టారు. పురోహితుడు, మతాచార్యుడు, దైవప్రార్థనలు చేశారు. శవపేటికచుట్టూ వెండి సెమ్మెలమీద అనేక కొవ్వొత్తులు వెలిగించి పెట్టారు. విషాద సంగీతం విని పిస్తోంది. కొంచెం దూరంగావున్న గదిలోంచి బిడ్డలమాటలు వినిపిస్తున్నాయి. వారిప్రక్కనఎవరో పెద్దవారు కూచునిబుజ్జగిస్తు న్నట్లు, జోకొట్టి పడుకో బెడుతున్నట్లు, శబ్దం వినిపిస్తోంది. మరణించిన ఆ స్త్రీ మొహం ఎంతో గంభీరంగా అగు పిస్తోంది. పురోహితుడు పఠిస్తోన్న పవిత్రమైన మంత్రాలు ఆమె అర్థం చేసుకుంటోందా?

# 4

ఒక నెలరోజుల తరువాత ఆ వ్యాధిగ్రస్తురాలి సమాధి మీద ఒకరాతిగుడి కట్టించారు. బండివాడి గోరీమీద ఇంత వరకూ ఒకరాయికూడా పాతలేదు. అక్కడక్కడ పచ్చని గడ్డిపరకలు మాత్రం మొలిచాయి.

ఒకనాడు స్టేషన్‌హౌస్‌లో బండివాడు సెర్గీకి, వంట మనిషి నస్టాస్యాకు ఇలా సంభాషణ జరిగింది:

నీకు పాపం తగులుతుంది సెర్జీ. థియోడర్‌కు రాతి శిలువ చేయించి గోరీమీద పెడతానని మాట ఇచ్చావు. అతను చచ్చి ఇంతకాలమైనా నీ వా విషయం పట్టించుకోలేదు. ఇదివరకు అడిగితే 'శీతాకాలం, శీతాకాలం' అని సాకు చెప్పి తప్పించుకున్నావు. ఇప్పుడైనా మాట చెల్లించుకోవడం మంచిది. అంది వంటమనిషి. 'నేను సాక్ష్యం వున్నాను నీకు తెలుసుగా? ఆ ముసలాడు ఇప్పటికే ఒకసారి కలలో కనిపించి హెచ్చరించాడు. మళ్ళీ కనిపిస్తాడు. ఏమనుకున్నావో?'

'ఇప్పుడు మాత్రం నేను మాట తప్పానా ఏం? రెండు రూబుల్సు పెట్టి ఒక శిలకొంటాను. అన్నమాట చెల్లించుకుంటాను. నేనేం మరచిపోలేదు. కాని విచారణ చెయ్యాలి కదా? నేను పట్నానికి వెళ్ళిననాడు కాస్త తీరిక చేసుకుని కొంటాను.' అన్నాడు సెర్జి'

'కనీసం ఒక శిలువ గుర్తుఅయినా చెక్కించి వాడి బొందమీద వడేయడం నీ ధర్మం. నీవు అతని బూడ్సులు తొడుక్కుంటున్నావుకూడా' అన్నాడు మరోవృద్ధుడు,

'శిలువ నా కెక్కడ దొరుకుతుంది.? ఎవరి మొద్దునో వగుల గొడతానా ఏమిటి?'

అంటే ఏమిటి నీవుద్దేశ్యం? శిలువ దొరకదంటావా? సంపాయించడం కష్టమంటావా? గొడ్డలితీసికొని ఒకనాడు అడవికిపోతే ఏదో ఒక చెట్టును నరకవచ్చు. దాంతో శిలువ తయారు చేయించవచ్చు. అడవిలో మొలిచిన చెట్టు ఎవరిసొత్తూ కాదు. ఎవరూ ఏమీ అనరు.'

మర్రోజు చీకటితోనే లేచి సెర్జి, గొడ్డలి తీసుకుని అడివికెళ్ళాడు.

తెల్లటి, చల్లటి మంచు కురుస్తోంది. తూర్పుదిశ కాంతి వంత మవుతోంది. ఆకాశంమీద తెల్లటిమబ్బులుదుబ్బులుదుబ్బులుగా వున్నాయి. ఒక చెట్టుఆకుగాని ఒకగడ్డిపరకగాని కదలడం లేదు, మెదలడంలేదు. అడవిఅంతా నిశ్చలంగా, నిశ్శబ్దంగావుంది. ఎక్కడో ఎప్పుడో ఏదో పక్షిచేస్తోన్న రెక్కలచప్పుడు కిర కిర మని వినిపిస్తోంది. అకస్మాత్తుగా ఒకవిచిత్రమైనధ్వని వినిపించింది. ఆ ధ్వని అడివి అంతా ఒక్కసారి ప్రతిధ్వనించి అంతలో దూరంగా పోయి మాయమైంది. మళ్ళీ అంతలో నిశ్చలాగావున్న చెట్ల నడుమ అదే ధ్వని వచ్చింది. ఒక వృక్షాగ్రం. అతి విచిత్రంగా అటూ ఇటూ కదల నారంభించింది. దానిఆకులు ఊగుతూ ఒక దానిమీద ఒకటి పడి గుస గుస లాడుకున్నాయి రాగాలు తీసే 'రాబిన్‌పక్షి' ఒక కొమ్మమీద కూచుని రెండుసార్లు గట్టిగా రెక్కలు విదిలించింది. పిమ్మట కూత కూస్తూ ఆ చెట్టుమీద నుంచి ఎగిరి మరో చెట్టుమీదికి పోయి కూచుంది

సెర్జి, చెట్టును నరకడం ప్రారంభించాడు. చుట్టూచిక్కగా అల్లుకున్న మంచులో ఆ గొడ్డలి దెబ్బలు కిరకిరమని వినిపిస్తున్నాయి. చెట్టు సమూలంగా అటూ ఇటూ ఊగుతూ వంగుతోంది. కొద్ది క్షణాలలోనే అది తన కొమ్మలు; రెమ్మలు, ఆకులు, చిగుళ్ళు బ్రహ్మాండంగా కదిలిస్తూ కూకటివేళ్ళను పెకలించుకుని ఫెళ ఫెళమంటూ అమాంతం నేలమీద కూలింది.

గొడ్డలి చప్పుడు, మనిషి పాదాల చప్పుడు ఆగిపోయాయి. రాబిన్‌పక్షి కూతకూస్తూ పైకి ఎగిరింది. చెట్టు కూలిపోవడంవల్ల అంతకు ముందు గుబురుగావున్న ఆ ప్రదేశం, ఇప్పుడు వెల్చగా, ఖాళీగా వుంది. చుట్టూ పెరిగివున్న తక్కిన వృక్షజాతులు ఏదో బరువు తగ్గినట్లు ఆనందిస్తూ నిశ్చలంగా నిలబడివున్నాయి.

అప్పుడే సూర్యోదయం అవుతోంది. ఉదయభానుని తొలికిరణాలు తూర్పుమేఘాలను చీల్చుకుని ఎర్ర ఎర్రగా పొడుచుకొచ్చి ధరామండలాన్ని అలంకరిస్తున్నాయి.

క్రమ్ముకున్న మంచు అలలమాదిరిగా లేచి క్రమక్రమంగా విడిపోనారంభించింది. ఆకసంమీద మేఘమాలికలు మరింత ధవళకాంతితో స్పష్టంగా ప్రకాశించసాగాయి. పక్షులు కిలకిల ధ్వనులతో, దట్టమైన ఆ అడివిలో అటూ ఇటూ తిరుగజొచ్చాయి. పొదలు, లతలు, చెట్టకొమ్మలు, రెమ్మలు; ఏదో చైతన్యం వచ్చినట్లుగా, కదలనారంభించాయి.

నేలకూలిన ఆ మహా వృక్షంచుట్టూ చల్లని మెల్లని గాలివీచింది. ఆ గాలి ప్రశాంతమైన, గంభీరమైన, వసాదగీతం ఆలాపించింది.

---

# సంగీతపాటకుడు

అప్పటికి రాత్రి రెండు గంటలు దాటింది. ఆ సమయంలో పీటర్స్‌బర్గులో జరుగుతోన్న చిన్న విందులో పాల్గొనడానికి అయిదుగురు యువకులు వచ్చారు. వారయిదుగురూ అమిత భాగ్యవంతులు.

విందులో ఎన్నో విశేషాలు జరిగాయి. అందులో పాల్గొన్నవారిలో చాలమంది మంచి వయసులో వున్నారు. ఎందరో అందమైన యువతులున్నారు. అంతా షాంపేన్ సేవించారు. పియానో, ఫిడేలు నిర్విరామంగా మ్రోగాయి. రకరకాల నృత్యాలుచేశారు. అంతులేకుండా పాటలూ, ఆటలూ సాగించారు. ఆ ప్రదేశమంతా ధ్వనులతో ఊగిపోయింది. ఇన్ని రకాల కాలక్షేపాలున్నా, ఎంచేతనో అందరూ అదోరకమైన సంకటంతో బాధపడసాగారు. ఈ సంతోషమంతా అనవసరమని వారికి తోచసాగింది.

ఇష్టం లేకపోయినా, బలవంతంగా, విసుగ్గా అన్ని పనులూ నిర్వర్తిస్తున్నారు. ఆలస్యంగా వచ్చిన ఆ అయిదుగురు యువకులలో ఒకతను మరీ విసుగ్గావున్నాడు. అక్కడ జరుగుతోన్న చర్యలన్నీ అతనికి మరింత అసంతృప్తిని, అసహ్యాన్ని కల్గించాయి. తన టోపీ ఎక్కడుందో వెదికి తీసుకున్నాడు. ఇంటికి పోదామనే ఉద్దేశ్యంతో మెల్లగా, నిశ్శబ్దంగా, హాలులోంచి ఇవతలికి వచ్చాడు.

అతను హాలు పక్కనవున్న చిన్న గదిలోకి వచ్చాడు. గదిలో ఎవరూ లేరు. కాని ప్రక్కనవున్న మరో గదిలోంచి ఇద్దరి కంఠస్వరాలు గట్టిగా వినిపిస్తున్నాయి. ఏమిటా అని ఆ యువకుడు అక్కడ ఆగి సంభాషణ వినసాగాడు

'వీల్లేదు, లోపల అతిథులున్నారు.' అంది ఒక స్త్రీకంఠం.

'మరేంఫరవాలేదు. నేను బాగానే వున్నాను. నన్ను లోపలికి వెళ్ళనీయి' అంటున్నాడు. ఒకపురుషుడు. అతని కంఠస్వరం అతిబలహీనంగా వుంది.

'వీల్లేదు. అమ్మగారి ఆజ్ఞ లేనిదే మిమ్మల్ని లోపలికి పోనివ్వను. చెవుతుంటే వెడతావేం? ఓ! ఏం మనిషివయ్యా నీవు' అంది మళ్ళీ ఆమె.

గభాలున తలుపు తెరుచుకుని ఒక విచిత్రమైన వ్యక్తి లోపలికి ప్రవేశించాడు. హాలు వాకిట్లో వున్న సేవకుడు అతన్ని ఆటంకపరచలేదు. అతను మెల్లగా తన వంగిపోయిన కాళ్ళను ఈడ్చుకుంటూ హాలులోకి వచ్చాడు. అతను అంత పొడుగూ కాదు, మరీ అంత పొట్టీ కాదు నడుము మాత్రం వంగివుంది పొడుగ్గావున్న అతనిజుట్టు రేగి మొహంమీద పడుతోంది. బిగుతుగావుండి, అక్కడక్కడ చిరిగిబోయిన ప్లాజరు తొడుక్కున్నాడు. పొట్టికోటు ఒకటి పైనవేసుకున్నాడు. అతను తొడుక్కున్న బూట్లు మకిలపట్టి చాల మొరటుగావున్నాయి, మెడకు 'టై' కట్టుకున్నాడు. అది ముడతలుపడివుంది. కోటు క్రింద వేసుకున్న చొక్కా పూర్తిగామాసిపోయి అసహ్యంగా వుంది. చేతులు సన్నగా ఊగులాడుతున్నాయి. అతనిమొహం మాత్రం తెల్లగా అతిసున్నితంగా వుంది. అతనికళ్ళు నల్లగా

మిలమిల మెరుస్తూ గంభీరతనూ, హుందాతనాన్నీ సూచిస్తున్నాయి. సన్నని మీసకట్టు, దానిక్రింద పల్చని పెదవులు, చూచేవారిని ఇట్టే ఆకర్షిస్తున్నాయి.

అతనలా కొంచెం ముందుకు నడిచి అక్కడ ఆగాడు. ఒక యువకుడివైపు తిరిగి మందహాసం చేశాడు. అతను ఎంతో కష్టంమీద చిరునవ్వు నవ్వినట్లు కనిపిస్తోంది. కాని అలా నవ్వినప్పుడు అతని మోహంలో ఏదో వెలుగు కనిపించింది.

'ఎవరతను?' అడిగాడు ఆ యువకుడు, అక్కడున్న పరిచారికను.

'నాటకశాలలో వుండే ఒక విచిత్రమైన గాయకుడు.' అంది పరిచారిక. 'అప్పుడప్పుడు అమ్మగారిని చూడడానికి ఇక్కడికి వస్తూ వుంటాడు.'

'ఎక్కడున్నావు జెలిసోవ్?' అంటూ అవతల్నుంచి ఎవరో పిలిచారు. వెంటనే ఆ యువకుడు నృత్యాం జరుగుతోన్న చోటకు వెళ్ళాడు. అతని పేరు జెలిసోవ్.

గాయకుడు వాకిట్లో నిలబడి నర్తకులవైపు ఆశక్తితో చూస్తున్నాడు. మందహాసంచేస్తూ, కాళ్ళతో మెల్లగా దరువు వేస్తూ తనలో తాను ఆనందిస్తున్నాడు.

'నీవుకూడా వచ్చి నృత్యము చెయ్యి' అక్కడున్న వారిలో ఒకడు అతన్ని ఆహ్వానించాడు.

గాయకుడు వినయంగా వంగి ఏమంటావు అన్నట్లు యజమానురాలివంక చూచాడు.

'వెళ్ళు, వెళ్ళు...ఆ పెద్దమనిషి నిన్ను మర్యాదగా ఆహ్వానిస్తున్నప్పుడు ఎందుకు వెళ్ళకూడదు 'అంది ఆమె.

అతని పల్చని శరీరం, బలహీనమైన అవయవాలు; అన్నీ అకస్మాత్తుగా పనిచేయసాగాయి. తక్కిన నర్తకులతో పాటు అతనూ కలిసి నృత్యంచేస్తోంటే ఆగది అంతా అసహ్యంగా అగుపించింది. అవును, అతను అభినయిస్తూన్నా ఏ అవయవం ఎటు కదిలిస్తున్నా, అదోలా, వికృతంగా కనుపించింది. నృత్యం చేస్తున్నవారిలో ఒక ఆఫీసరున్నాడు. అతను గిర్రున తిరుగుతూ మధ్యలో పొరపాటునవచ్చి గాయకుడి వీపుకు కొట్టుకున్నాడు. పాపం, ఆ తాకిడికి గాయకుడు నిలబళ్ళేకపోయాడు. కాస్సే నిలతొక్కుకోవాలని ఎంత ప్రయత్నించినా బలహీనంవల్ల అతని పాదాలు భూమిమీద ఆనలేకపోయాయి. వెంటనే అమాంతంగా క్రిందపడిపోయాడు. దాంతో అక్కడున్నవారంతా పగలబడి నవ్వసాగారు.

కాని గాయకుడు లేవలేదు. నృత్యం ఆగిపోయింది. పియానోకూడా ఆపుచేశారు. అంతా నిశ్శబ్దంగా అతని వైపు చూడసాగారు డెలిసోవ్, ఆ ఇంటి యజమానురాలు; వీరిద్దరూ అతని వద్దకు పరుగెత్తారు. గాయకుడు ఒక ప్రక్కకు పడిపోయి, దీనంగా నేలమీదికి చూస్తున్నాడు, వారు అతన్ని లేవనెత్తి ఒక కుర్చీలో కూచోబెట్టారు. వెంటనే అతను, తన మొహంమీదికి పడినజుట్టును చేత్తో సవరించుకున్నాడు. వారు అడిగే ప్రశ్నలకు జవాబు చెప్పకుండా మందహాసంచేస్తూ కూచున్నాడు.

'ఆల్బర్ట్! ఏం ఆల్బర్ట్!' యజమానురాలు అడగ సాగింది.

'ఎక్కడైనా దెబ్బతగిలిందా? ఏం? నృత్యం చేయవద్దని నీకు ఎన్నోసార్లు చెప్పాను.' అంటూ ఆమె అతిథులవంకతిరిగి మళ్ళీ చెప్పసాగింది: 'అతను పట్టి దుర్బలుడు. నడిచేటప్పుడే ఎంతో కష్టంమీద నడుస్తాడు. అలాంటివాడు నృత్యం ఏం చేయగలడు?'

'ఎవరతను?' అతిథులు ఆమెను ప్రశ్నించారు.

'ఒక పేదవాడు – గొప్ప కళాకారుడు. చాలామంచి వాడు. కాని అలాంటివాడికి ఎట్టి దుర్గతి పట్టిందో చూడండి.' అంది ఆమె.

గాయకుడున్నాడని సంకోచించకుండానే ఆమె ఈమాటలు అన్నది. అంతలో అతను గభాలున ఏదో లోకంలోంచి మన మధ్యకు వచ్చినట్టుగా తెప్పరిల్లుకున్నాడు.

'ఇది ఏమంత ప్రమాదకరమైందికాదు.' అన్నాడతను. ఎంతోకష్టంమీద లేవడానికి ప్రయత్నిస్తూ.

ఏమీ దెబ్బ తగలనివాడికిమల్లే నడుచుకుంటూ గది మధ్యలోకి వెళ్ళాడు. గభాలున ముందుకు దూకబోయాడు. మళ్ళీ అప్పుడు క్రిందపడవలసినమాట. కాని ప్రక్కన వున్నవారిలో ఒకరు అతన్ని పట్టుకున్నారు.

అతన్ని చూస్తుంటే అందరికీ అదోలావుంది. అంతా మౌనంగా వున్నారు.

గాయకుడి కళ్ళు మళ్ళీ మందంగా ప్రకాశించసాగాయి. తన చేత్తో మోకాలుమీద రుద్దుకున్నాడు. గభాలున తల ఎత్తి

తడబడుతోన్న అడుగులతో ముందుకునడిచి ఫిడేలు వాయించే వాడివద్దకు వెళ్ళాడు. అతను వాయిస్తోన్న ఫిడేలు తను తీసుకొన్నాడు.

'ఇదేమీ ప్రమాదమైందికాదు ' అన్నాడతను మరోసారి.

'మిత్రులారా! మనం కాసేపు పాటకచ్చేరి చేద్దాం.' అంటూ ఫిడేలు తీగలు సర్దాడు.

'ఎంత విచిత్రమైనమనిషి!' అక్కడున్నవారు ఒకరితో ఒకరు అనుకున్నారు.

'గొప్ప ప్రజ్ఞావంతుడిలా వున్నాడు.' అన్నాడొకాయన.

'అవును పాపం. అతనిస్థితి చూస్తే జాలి వేస్తోంది.' అన్నారు మరొకరు.

'అతని మొహంలో ఎంత కళ వుంది!...అతను ఏదో అసాధారణమైన వ్యక్తిలా వున్నాడు...' అన్నాడు కెలిసోల్.

'సరే. ఏం జరుగుతుందో చూద్దాం......'

## 2

ఈ మధ్యలో ఆల్బర్ట్ ఏ సంగతీ పట్టించుకోకుండా, ఫిడేలు తన భుజంమీదికి సర్దుకున్నాడు. పియానో ప్రక్కన అటూ తిరుగుతున్నాడు. అతని పెదవులు అప్రయత్నంగా కదల నారంభించాయి. నేత్రాలు మరుగుపడివున్నాయి. చిక్కిపోయి వున్న అతని వీపు, పొడుగ్గా తెల్లగా వున్న మెడ, చెదిరివున్న నల్లని తలవెంట్రుకలు, వంకరకాళ్ళు; ఇవన్నీ ఒక విచిత్రమైన దృశ్యం లా కనిపించసాగాయి. ఫిడేలును చమత్కారంగా

తిప్పుతూ, తల ఆడిస్తూ పియానో వాయించే అతనివైపు చూచాడు. అతనువెంటనే ఆల్బర్ట్ను అనుసరించడానికి సిద్ధపడ్డాడు.

'మెలంకో లీ-జీ-డర్' అంటూ ఆల్బర్ట్, అతనిని ఫలానాపాట వాయించమని హెచ్చరించాడు. అలాఅనడంలో అతనిలో ఒక హుందాతనం కనిపించింది.

వెంటనే అతను మందహాసంచేస్తూ అక్కడున్న ప్రేక్షకులవైపు క్రీగంట చూచాడు. 'కమాను' పట్టుకున్న చేత్తో మొహంమీద పడుతోన్న జుట్టును వెనక్కు సవరించుకుని పియానో వున్న మూలకు వెళ్ళి నిలుచున్నాడు. చాల తమాషాగా, తేలికగా, కమానును తీగెలమీదపెట్టి అతి మృదువుగా ఫిడేలు వాయించ సాగాడు. ఒక్కసారిగా మధురమైన సంగీత ధ్వని గదిఅంతా వ్యాపించింది. ఎక్కడివారక్కడ నిశ్చేష్టులై నిశ్శబ్దంగా నిలబడిపోయారు.

క్రమక్రమంగా ఫిడేలు సంగీతం తరంగాలమాదిరిలేచి, శ్రోతలను ఆనందంలో ముంచివేస్తోంది. అక్కడున్న ప్రతి ఒక్కరూ తన్మయులైపోయారు. మనలోకం వదిలి ఏదో లోకంలో విహరిస్తున్నట్లు తోస్తోంది వాళ్ళకు. అవును. సంగీతానికి సాటి మరొకటుంటుందా ? అందులోనూ ఇలాంటి గానం వారు ఎన్నడూ వినలేదు. అనేకమంది ఫిడేళ్ళు వాయిస్తారు. కాని ఇలాంటి రాగం, తానం, పల్లవి, మీటు ; ఎన్నడూ ఆలకించలేదు. ఆల్బర్ట్ వాయిస్తోన్న పాటలో ప్రతిమెట్టూ వాళ్ళకు స్పష్టంగా, స్ఫటికంలా గోచరిస్తోంది. అందులోని భావపరంపరలు వారిని క్షణక్షణానికి ఆకర్షిస్తూ ముందుకు తీసుకె

పోతున్నాయి. అతని సంగీతంలో ఎక్కడా ఒక తప్పుగాని, తడబాటుగాని వారికి కనిపించడంలేదు. అందరూ పరవశంగా వింటున్నారు. అంతవరకూ లల్లాయి పాటలతో, అల్లరి చిల్లరి నృత్యాలతో వారంతా ప్రొద్దుపుచ్చారు. ఇప్పుడీ వినూత్న సంగీతం వారికి ఎంతో హాయిని, ఆనందాన్ని కలిగిస్తోంది. అను క్షణం పొందుతోన్న అనుభూతులతో వారి ప్రపంచాన్నే మరిచిపోయారు. అతని వాయిద్యంలోని ధ్వనులన్నీ అతిదీనంగా వినిపిస్తున్నాయి. మానవజీవితంలోని విషాదమును వెళ్ళగక్కు తున్నాయి. గడిచిపోయిన మధురస్మృతులను తలంపుకు తెస్తు న్నాయి. ప్రవాహంవలె వరుగిడుతోన్న ఆ సంగీతం క్రమ క్రమంగా స్థాయి హెచ్చుతోంది. ప్రతి శబ్దమూ, ఎంతో స్ఫుటంగా, పరిపూర్ణంగా, భావయుక్తంగా, ఏదో బ్రహ్మానందా ర్థాన్ని సూచిస్తున్నట్లుగా వుంది, ఏదో అద్భుతమైన కవితాస్రవంతి ప్రవహిస్తున్నట్లుగా వుంది. ఆ ప్రవాహంలో అందరి హృద యాలూ తేలికగా తేలిపోతున్నాయి. అందరి ఆత్మలూ ఏదో అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతున్నాయి. ఆ గది అంతా ఏదో వెలుగుతో, మహత్తుతో కళకళలాడుతోంది, ఆల్‌బర్ట్ ఫిడేలు వాయిస్తూ ప్రతి మెట్టుకూ పైకిపోతున్నాడు. అతనొక అద్భుతమైన కళామూర్తిమల్లే అగుపిస్తున్నాడు. ఫిడే లును గడ్డంతో అదిమిపట్టాడు. పరవశుడై పాదాలతో చిందులు తొక్కుతున్నాడు, వెన్నువిరిచి నిటారుగా నిలబడ్డాడు. ఎత్తై యున విగ్రహం మాదిరి కనిపిస్తున్నాడు. ఎడమ చేతిని వంచి ఫిడేలు బలంగా పట్టుకున్నాడు. పల్చనివేళ్ళు, తీగెలమీద చిత్రంగా ఆడుతున్నాయి. కుడిచేత్తో పట్టుకున్న 'కమాను'

మెల్లగా, అతిసున్నితంగా అటూ ఇటూ తిరుగుతోంది. అతని మొహం ఏదో అవ్యక్తమైన ఆనందంతో ప్రకాశిస్తోంది. కళ్ళు, అద్భుతమైన వెలుగుతో మిలమిల మెరుస్తున్నాయి. నాసికా రంధ్రాలు పెద్దవి అయి వణుకుతున్నాయి. సంతోషంతో తెరిచివున్న పెదవులు కదలిపోతున్నాయి.

ఒక్కోసారి అతను తన తలనువంచి ఫిడేలుకు అతిసమీపంలో వుంచుతున్నాడు. కళ్ళు మూస్తున్నాడు. మొహాన జుట్టు పడి సరిగా కనపించడంలేదు. పెదవులమీద చిరునవ్వు తొణికిసలాడుతోంది. ఒక కాలు ముందుకు వేసి, నిటారుగా గదిలో ఒక వైపునుంచి మరోవైపుకు తిరుగుతున్నాడు. ఏదో గర్వం, గంభీరత హుందాతనం; ఇవన్నీ అతనిలో అగుపిస్తున్నాయి. ఏదో బ్రహ్మాండమైన శక్తి అతన్ని ఆవహించినట్లుతోస్తోంది. ఒకసారి పియానో వాయించే అతను తప్పుడుశృతి వేశాడు. వెంటనే ఆల్‌బర్ట్ మొహంలో విపరీతమైన బాధ గోచరమైంది. అతని శరీరంలోని నరనరాలు ఆవేదనతో వుడికిపోయినట్లు కనిపించింది. ఒకక్షణం ఆగాడు. పసివాడికిమల్లే కోపం తెచ్చుకున్నాడు. పాదంతో నేలమీద గట్టిగా తన్నాడు. 'మోల్ సెమోల్!' అంటూ అరిచాడు. అవును శృతి తప్పిందనీ, సరిగా వాయించమనీ, పియానో వాయించే అతన్ని హెచ్చరించాడు. అప్పుడు అతను తన తప్పును దిద్దుకున్నాడు. మళ్ళీ ఆల్‌బర్ట్ నిమీలిత నేత్రుడై ఇతరులను, తనను, యావత్ప్రపంచాన్నే మరిచిపోయి మందహాసంచేస్తూ మరోలోకంలోకి వెళ్ళిపోయాడు.

గదిలో వున్న వారంతా ఆల్బర్ట్ సంగీతాన్ని శ్రద్ధగా ఆలకిస్తున్నారు. అంతా నిశ్శబ్దంగా వున్నారు. అందరిలోనూ ఏదో జీవశక్తి, చైతన్యం ప్రవహించి నట్లుగా వుంది.

ఆఫీసరు, ఆనందభరితుడై కిటికీ ప్రక్కన కుర్చీలో కదల కుండా కూచున్నాడు. యువతులందరూ గోడ ప్రక్కన నిశ్చలంగా కూచుని చూస్తున్నారు. మధ్యమధ్యమాత్రం ఒకరి వంక ఒకరు చూచుకుంటూ సంతృప్తిని వెలిబుచ్చుతున్నారు. ఆ గృహ యజమానురాలు ఆనందంతో పొంగిపోతోంది. పియానో వాయించే అతను తను తప్పు వాయించానని భయంతో ఆల్బర్ట్ వైపు బెదురుచూపులు చూస్తున్నాడు. అక్కడికి వచ్చిన అతిథులలో మరీ తాగివున్న ఒకతను సోఫాలో పడుకుని వున్నాడు. తనవల్ల అక్కడివారి ప్రశాంతతకు భంగం కలుగు తుందనే భయంతో వళ్ళంతా బిగపట్టుకుని పడివున్నాడు. డెవిసోవ్ ఎన్నడూ ఎరుగని ఆనందానుభూతిని పొందుతున్నాడు. అప్రయత్నంగా అతని కళ్ళనుండి నీరు కారుతోంది. ఆల్బర్ట్ యొక్క ఫిడేలు సంగీతం అతన్ని తిరిగీ పూర్వం కోల్పోయిన యావ్వనంలోకి లాక్కుపోతోంది. తలవని తలంపుగా పది హేడు సంవత్సరాల బాలుడికి కలిగే భావాలు అతనికి కలుగు తున్నాయి. తను తొలిసారిగా ప్రేమించిన ఒక అమ్మాయి స్మృతిపథంలోకి వచ్చింది. ఆమె ధరించిన రోజా రంగు దుస్తులు ఆమెతో కలిసి తను ఉద్యాన వనంలో విహరించడం, ఒకరి నొకరు వెచ్చని, పచ్చని ముద్దులు పెట్టుకోవడం, ఆనాటి ప్రకృతి దృశ్యాలు; ఇవన్నీ అతని కళ్ళముందు మాయజగత్తులా మెరిసిపోయాయి. ప్రియురాలితో జరిపిన ఏకాంత సంభాషణలు

కురిపించిన వలపులు, మురిపించిన తలపులు, ఒకదాని తరువాత ఒకటి జ్ఞప్తికి వస్తున్నాయి. అవన్నీ తలుచుకుంటూ అతను ఆనందిస్తున్నాడు. దుఃఖిస్తున్నాడు—అలా దుఃఖించడానికి కారణం, 'అయ్యో, అదంతా జరిగిపోయిందే' అని కాదు. అలాంటి యౌవ్వనం, శక్తి, ప్రేమ, సౌఖ్యం, శాశ్వతంగా వెళ్ళిపోయాయనీ, మరెన్నడూ తిరిగిరావనీ, అతను విచారిస్తున్నాడు. అతనికి జ్ఞాపకాలొస్తున్నాయి ఆల్బర్ట్, ఫిడేలును ఇంకా హెచ్చు స్థాయిలో వాయిస్తున్నాడు. 'ఆరోజులు రావోయ్' అని అతని సంగీతం సంబోధిస్తున్నట్లు అనిపిస్తోంది. 'అవే నీ జీవితంలో మధురమైన రోజులు! మంచి రోజులు! మరిచిపోలేని రోజులు! మరెన్నటికీ తిరిగిరావు! వాటికోసం దుఃఖించు! కడవలుగా కన్నీరు కార్చు! ఏడ్చి ఏడ్చి చచ్చిపో! అంతే నీవు చేయగలిగింది' అని చెప్తున్నట్లుగా వుంది.

చివరిమెట్టు వాయిస్తూవుండంగా ఆల్బర్ట్ మొహం ఎర్రబారింది. కళ్ళు జ్యోతుల్లా అయినాయి. మొహానిండా చెమట పోసి, చెక్కిళ్ళమీదనుంచి కారుతోంది. శరీరం, మరింత కదలనారంభించింది. అతని పెదవులు వెడల్పుగా తెరచుకున్నాయి. అతని ఆకృతి యావత్తూ స్వర్గానందంలో మునిగిపోయింది.

బలాత్కారంగా తనశరీరాన్ని స్వాధీనంలోకి తెచ్చుకున్నాడు. మొహానపడిన వెంట్రుకలను వెనక్కి తోసుకుని, మెల్లగా ఫిడేలును క్రిందికిదించాడు. పెదవులమీద చిరునవ్వు తాండవిస్తోంది. గర్వంగా, గంభీరంగా, ప్రేక్షకులందరివైపూ చూచాడు. మళ్ళీ అతని దుర్బలమైన నడుము వంగిపోయింది. పెదవులు మూసుకున్నాయి. కళ్ళు మందంగా మసకలు కమ్మాయి.

సిగ్గుపడినట్లు మొహంముడుచుకు పోయింది. కళావిహీనమైన వద నంతో, తలవంచుకుని మెల్లగా ప్రక్కగదిలోకి వెళ్ళిపోయాడు.

## 3

ఆల్బర్ట్ సంగీతానికి అక్కడున్నవారంతా ముగ్ధులై పోయారు. అతను సంగీతం ఆపుచేసి అక్కణ్నుంచి వెళ్ళిపోగానే అందరూ ఆశ్చర్యచకితులై ఒకరివంవంక ఒకరు చూచుకున్నారు. అంతవరకూ వారి హృదయాలలో కలిగిన ఆనందానికి అర్థమే మిటో ఎవరూ చెప్పలేకపోయారు. క్రమ క్రమంగా అంతా మనలోకంలోకి వచ్చారు.

'నిజంగా అతను గొప్ప గాయకుడు!' అన్నాడు ఆఫీసరు.

'అవును, అద్భుతంగావాయించాడు!'అన్నాడుడెలిసోవ్.

'ఇహామనం వెళ్ళిపోయే తరుణంవచ్చింది. అందరం తలా కాస్తా చందా వేసి ఆ డబ్బుతో అతన్ని సత్కరిద్దాం.' అన్నాడు తాగి సోఫాలో పడుకున్న పెద్దమనిషి తెప్పరిల్లుకొని.

ఆ సమయంలో ఆల్బర్ట్ ప్రక్క గదిలో సోఫాలో కూచునివున్నాడు. చెమటపట్టి తడిగావున్న చేతులతో మొహం మీంది వెంట్రుకలు సరిచేసుకుంటున్నాడు. తనలో తాను ఏదో ఆనందాన్ని పొందుతున్నాడు.

అక్కడివారంతా ఘనంగా డబ్బు వసూలుచేసి, అదంతా డెలిసోవ్‌కు ఇచ్చారు. ఆ డబ్బు తీసుకుని డెలిసోవ్ ఆల్బర్టుకు ఇవ్వడానికి అక్కడికొచ్చాడు.

అసలు డెలిసోవ్‌కు ఆల్బర్ట్ మీంద ఒక విధమైన అభి మానం, ప్రేమ, ఏర్పడ్డాయి. ఆల్బర్ట్ కళాపాండిత్యమే అం

దుకు కారణం. అతన్ని ఎలాగైనా ఈ దీనస్థితిలోంచి ఉద్ధరించాలనే ఉద్దేశ్యం కలిగింది డెలిసోవ్‌కు. ఆ అభాగ్యుని తన ఇంటికి తీసుకెళ్ళి, మంచి దుస్తులు కట్టబెట్టి, భోజనం, వసతి ఏర్పాటు చేయాలనే తలంపు కలిగింది. 'నీవు బాగా అలసిపోయావుకదూ?' అడిగాడు డెలిసోవ్ అక్కడికి వస్తూనే.

ఆల్‌బర్ట్ మందహాసం చేశాడు.

'సంగీతంలో నీకు మంచి ప్రజ్ఞవుంది. నీవింకా ఈకళను వృద్ధిచేసి బహిరంగంగా కచ్చేరీలు జరిపితే చాలా బాగుంటుంది.' అన్నాడు మళ్ళీ డెలిసోవ్.

'నాకు కొంచెంపానీయం కావాలి.' అడిగాడు ఆల్‌బర్ట్ అప్పుడే నిద్రనుంచి మేలుకొన్నట్లు.

డెలిసోవ్, ద్రాక్ష సారాయి తెచ్చి అతని కిచ్చాడు. అతను రెండు గ్లాసుల సారాయి గటగట త్రాగేశాడు.

'ద్రాక్షసారాయి చాల బాగుంది.' అన్నాడు ఆల్‌బర్ట్.

'నీవు వాయించిన ఆ 'మెలంకోలీ' సంగీతం అద్భుతంగా వుంది' అన్నాడు డెలిసోవ్.

'అవునవును.' అంటూ నవ్వాడు ఆల్‌బర్ట్. 'నన్ను క్షమించండి. మీరెవరో తెలీకుండా చొరవ కలిగించుకుని మాట్లాడుతున్నాను. బహుశా మీరు పెద్దజమీందారు అయి వుండొచ్చు. లేకపోతే రాకుమారుడైనా కావచ్చు. మరేమీ అనుకోకండి. నాకు కొంచెం డబ్బు కావాలి. ఇవ్వగలరా!... నాదగ్గర ఏమీలేదు. పేదవాణ్ణి......తీసుకున్నది మళ్ళీ ఇవ్వడానికికూడా నాకు శక్తిలేదు...'

అది విని డెలిసోవ్ చాల బాధపడ్డాడు. తన తెలివి తక్కువకు నిందించుకుంటూ విసూలుచేసి తన దగ్గర వుంచుకున్న డబ్బు వెంటనే అతనికి ఇచ్చేశాడు.

'ధ్యాంక్సు. మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి. మళ్ళీ కొంచెం సేపు ఫిడేలు వాయించనా? మీ ఆనందం కోసం ఎంతసేపయినా కచ్చేరీ చేస్తాను...నాకు కాస్త తాగుడువుంటే చాలు. ఇంకేమీ అక్కర్లేదు.' అన్నాడు ఆల్బర్ట్ సోఫా లోంచి లేస్తూ.

డెలిసోవ్ అతనికి మరికొంత బ్రాందీ తెచ్చియిచ్చాడు. తన ప్రక్కన కూచోపెట్టుకున్నాడు.

'నీతో చనువుగా వుంటున్నాను - మరేం అనుకోకు - నిజం చెపుతున్నాను. నీసంగీత పాండిత్యం నన్ను ముగ్ధుణ్ణిగా చేసింది. నిన్ను గురించి విచారించాలనే ఆసక్తి కలిగింది. చూడ బోతే నీస్థితి బాగులేట్లుగా తోస్తోంది.' అన్నాడు డెలిసోవ్.

అంతలో ఆ ఇంటి యజమానురాలు అక్కడికి వచ్చింది. ఆల్బర్ట్ ఒకసారి ఆమె వైపు, మరోసారి డెలిసోవ్ వైపు చూచాడు.

'నీకు ఏం కావలిస్సివున్నా నన్ను అడుగు. ఇవ్వడానికి సిద్ధంగా వున్నాను. నీవు ఏ పని కావాలంటే ఆ పని చేస్తాను. మా ఇంటికి వచ్చి నాతోపాటు కొంతకాలం అక్కడవుంటే ఎంతో సంతోషిస్తాను. పైగా నేను ఒంటరిగా వుంటున్నాను. మాఇంట్లో మరెవరూ లేరు.' అన్నాడు డెలిసోవ్.

ఆల్బర్ట్ అందుకేమీ సమధానం ఇవ్వక మందహాసం చేస్తూ కూచున్నాడు.

'నీ అదృష్టం పండింది! ఆయన వెంట వెళ్ళు. సుఖపడతావు. నీకు సహాయం చేయమని దేవు డతన్ని నీ దగ్గరకు పంపాడు. కాని ఆల్‌బర్ట్‌! నే నిచ్చేదలుచుకున్న సలహా ఒక్కటే! నీవు తాగుడు...' అంటూ యజమానురాలు, ఆల్‌బర్ట్ వైపూ, పెమ్మట డెలిసోవ్ వైపూ, అదోలా చూచింది.

'మీ అభిమానానికి ఎంతో కృతజ్ఞుణ్ణి' అంటూ ఆల్‌బర్ట్ చెమటపోసిన తనచేత్తో, డెలిసోవ్ చేతిని గట్టిగానొక్కాడు. 'ఇహమనం కాసేపు సంగీతంతో కాలక్షేపం చేద్దామా?' అన్నాడతను మళ్ళీ.

కాని అప్పటికే చాలమంది అతిథులు ఇళ్ళకు వెళ్ళిపోడానికి సంసిద్ధులయినారు. ఆల్‌బర్ట్‌కూడా చేసేదేమీలేక యజమానురాలిదగ్గర సెలవుతీసుకుని, డెలిసోవ్ వెంట అవతలికి వెళ్ళిపోయాడు.

ఇద్దరూ బండ్లోకూచున్నారు. గాయకుడి ప్రక్కనకూచుంటే డెలిసోవ్‌కు అదోలా అనిపించింది. అతను వేసుకున్న మురికి బట్టలు, నోటినుండి వెలువడే బ్రాందీ కంపు డెలిసోవ్‌కు అసహ్యాన్ని, చిరాకును, కలిగించాయి. ఇలాంటి పనికిమాలిన వ్యక్తితో సంబంధం పెట్టుకుని, అనవసరంగా తనతో తీసుకవెడుతున్నానని బాధపడసాగాడు. తొందరపడి, పొరపాటుపని చేశానని చింతించసాగాడు. ఆల్‌బర్ట్ చర్యలన్నీ అతనికి ఒకరకమైన జుగుప్సను కల్గించ నారంభించాయి. 'ఇలాంటి వ్యక్తిణ్ణి ఇంటికి తీసుకుపోయి ఏం చేయాలి?' అని తనలోతాను ప్రశ్నించుకున్నాడు.

అలా ఓ పావుగంటసేపు బండ్లో ప్రయాణం చేశారు. ఆల్బర్ట్ ఏమీ మాట్లాడకుండా మౌనంగావున్నాడు అతని నెత్తిమీద టోపీ కాళ్ళదగ్గర పడిపోయింది. బండ్లో ఒక మూలకు ఒదిగి, తల వ్రేలాడు వేసుకుని కూచున్నాడు. వళ్ళు తెలియకుండా బిగ్గరగా గురక పెట్టడం మొదలెట్టాడు. మంచుచే కప్పబడిన బాటలోంచి, బండి కిరకిరమని చప్పుడుచేసుకుంటూ పోతోంది. బండికి అమర్చిన కిటికీ అద్దాలలోంచి బయటికిచూస్తే, అప్పు డప్పుడే తెల్లవార వస్తున్నట్లు తెలుస్తోంది.

డెలిసోవ్, తన మిత్రుడివైపు ఒకసారి పరిశీలనగా చూచాడు. పొడుగ్గావున్న అతని శరీరం చైతన్య రహితమైన శవం లా ప్రక్కన పడుంది. తల క్రిందికి వ్రేలాడుతోంది. డెలిసోవ్, మళ్ళీ ఒకమారు అతన్ని పరీక్షగాచూస్తూ అతని మొహ లక్షణాలు పరిశీలించాడు. అతని నుదుటిమీద, నిశ్శ బ్దంగా, నిశ్చలంగా మూసుకునివున్న పెదవులమీద ఏదో అవ్యక్తమైన సౌందర్యం గోచరించింది. తిరిగి డెలిసోవ్ మనసు మారింది. అతను ఫిడేలు వాయిస్తూ గానం చేసేటప్పుడుపొందే ఆనందానుభూతి, తిరిగి డెలిసోవ్ కళ్ళముందు మళ్ళీ సాక్షాత్క రించింది.

ఆ చల్లని ప్రభాతవేళ అభాగ్యుడైన ఆల్బర్ట్ కళా ప్రతిభను గుర్తు చేసుకునేసరికి డెలిసోవ్ తిరిగి మరో ప్రపంచంలోకి వెళ్ళిపోయాడు. తన యౌవ్వనదశలో గలిగిన మధుర స్మృతులు, మనోజ్ఞమైన దృశ్యాలు అన్నీ మనసులో మెరిశాయి. వెంటనే అతనికి ఆల్బర్ట్ మీద సానుభూతికలిగింది.

# 4

మరునటిరోజు ఉదయాన్నే మెలిసోవ్ నిద్రలేచి చుట్టూ కలయ చూచాడు. మామూలు ప్రకారం అతని పడకగదికి అడ్డంగా కట్టివున్న పాత తెర ప్రక్కనే టేబిలుమీదవున్న తన గడియారం, ఎదురుగా నిలబడివున్న ముసలినౌకరు ఆకారం ఇవన్నీ సాక్షాత్కరించాయి. రోజూచూచే ఆ పాతదృశ్యాలే తన కళ్ళముందు కనిపించేసరికి అతని మనస్సు కలవరపాటు చెందింది. 'నాచుట్టూ ఏ వస్తువులు వుంటాయో, అంతకన్నా నాకు ఏం కనిపిస్తాయి'? అని తనలోతాను ప్రశ్నించుకున్నాడు. అప్పుడతనికి ఆ గాయకుని నల్లటికళ్ళు, మనోహరమైన మందహాసం, అతను పాడినపాట; అన్నీ గుర్తుకొచ్చాయి. గతరాత్రి జరిగిపోయిన దృశ్యమంతా కళ్ళకు కట్టినట్లయింది.

తను చేసింది తప్పో, రైటో, ఆ గాయకుణ్ణి తనఇంటికి తీసుకరావడం మంచో, చెడో; ఆలోచించడానికి కూడా అతనికి వ్యవధలేదు. దుస్తులు ధరించి తన పనిమీద బయటికి వెళ్ళిపోతూ, ఇంట్లో వ్యవహారాలను గురించి నౌకరుకు ఉత్తర్వులిచ్చాడు. గబగబ బూట్లు తొడుక్కుని ఓవర్‌కోటు వేసుకున్నాడు. భోజనశాలముందునుంచి వెళ్ళిపోతూ తలుపువద్దనిలబడి లోపలికి చూచాడు. ఆల్బర్ట్ కాళ్ళు చేతులు ముడుచుకుని, దిండులోకి తలదూర్చి సోఫాలో వళ్ళు తెలీకుండా నిద్రపోతున్నాడు. అతని మురికిబట్టలు, చిరిగి పీలికలైన చొక్కా; దూరంనుంచి చూస్తోంటేనే, చాల అసహ్యంగా అగుపిస్తున్నాయి. గతరాత్రి స్పృహలేకుండావున్న అతన్ని, బండ్లోంచి మోసుకొచ్చి ఆ సోఫాలో పడుకోబెట్టాడు. ఇప్పటికీ తెలివి

రాక్షసుడా అలాగే శయనంలాపడున్నాడు 'ఏదో పొరపాటు జరిగింది!' అనుకున్నాడు జెలిసోవ్, తనలో అకస్మాత్తుగా.

"నీవు 'బోరియయాజోవస్కీ' ఇంటికి ఒకసారి వెళ్ళు. రెండు రోజులపాటు అతని ఫిడేలు, నేను కావాలన్నానని చెప్పి తీసు కరా!" అని నౌకరుతో చెప్పాడు జెలిసోవ్. 'మరో విషయం. అతను లేవగానే కాఫీ ఇవ్వు. తరువాత నాబట్టల్లోంచి ఏవో కొన్ని తీసి అతనికి కట్టుకోవడానికి ఇవ్వు. తెలిసిందా! అతనికి కావల్సిన వ్యవహారాలన్నీ నీవు కాస్త జాగ్రత్తగా చూడాలి సుమా!'

సాయంత్రం జెలిసోవ్ ఆలస్యంగా ఇంటికి వచ్చాడు. ఇంట్లో ఆల్బర్ట్ కనిపించకపోయేసరికి అతనికి ఆశ్చర్యం వేసింది. 'అతను ఎక్కడున్నాడు?' నౌకర్ను ప్రశ్నించాడు జెలిసోవ్. 'భోజనం అయినవెంటనే బయటికి వెళ్ళిపోయాడు.' చెప్పాడు నౌకరు. 'మీరు చెప్పిన ప్రకారం ఫిడేలు తెచ్చి ఇచ్చాను. అది తీసుకుని ఆయన ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఒక గంటలో తిరిగొస్తానని చెప్పాడు, కాని ఇంతవరకూ రాలేదు.'

'అయ్యయ్యో! ఎంత పని జరిగింది? జెలిసోవ్ తత్తర పాటుతో పెదవులు కొరుక్కున్నాడు. 'అతన్ని బయటికి ఎం దుకు వెళ్ళనిచ్చావు జాకర్?'

జాకర్ ముసలివాడు. పీటర్స్‌బర్గునుంచి వచ్చాడు. ఎని మిది సంవత్సరాలబట్టే జెలిసోవ్ వద్ద నౌకరుగా పనిచేస్తు న్నాడు. జెలిసోవ్‌కు పెళ్ళికాలేదు. ఒంటరివాడవటంచేత, ఏ విషయమైనా తన నౌకరుతో చెప్పి అతని అభిప్రాయాలు తీసు కోవడం అతనికి అలవాటు.

'ఏంచేయను అయ్యగారూ! ఆయన్ను బయటికిపో కుండా నేను ఎలా ఆపగలను? పైగా తను ఆవిషయం నాతో చెప్పలేదుకూడా. చెప్పివున్నట్లయితే అలాగే చేసివుండే వాణ్ణి! అతనికి బట్టలూ మొదలైనవి ఇచ్చి మర్యాద చేయవల సిందని మాత్రమే మీరునాతో చెప్పారు.' అన్నాడు జాకర్ వినయంగా.

'ఇస్ ఎంత పని జరిగింది? సరేకాని, నేను లేనప్పుడు అతను ఇక్కడ ఏం చేశాడు?' అడిగాడు డెలిసోవ్.

జాకర్ మందహాసంచేశాడు.

'ఏం చేశాడని చెప్పేది అయ్యగారూ! ఆయనొక విచి త్రమైన మనిషి. నిద్రలేవగానే బ్రాందీ కావాలని అడిగాడు. తెచ్చిఇచ్చాను. టీ కూడా ఇచ్చాను. తరువాత ఆయన మన వంటవాడితోటీ, ప్రక్కఇంటి నౌకరుతోటీ, పరిహాసాలాడు తుంటూ కొంతసేపు కాలక్షేపం చేశాడు. హాస్యాలాడడం లోను, చమత్కారంగా మాట్లాడడంలోను, ఆయన బహు నేర్పరి. మొత్తానికి చాలా మంచివాడు. పిమ్మట నేను భోజనం వడ్డించాను. కాని ఆయన భోజనం చేయకుండా నన్నుకూడా తన ప్రక్కన కూచుని భోంచేయమని ఆహ్వానించాడు. ఆ తరు వాత ఫిడేలు తెచ్చి ఇచ్చాను. ఆయన దాన్ని ఎంతబాగా వాయించాడో చెప్పలేను. సంగీత విద్వాంసులలో ఇంతటి ప్రజ్ఞ కలవాళ్ళు బహుకొద్దిమంది వుంటారు. ఆయన సంగీతం వింటే ఎంతటివాడైనా ఇట్టే లొంగిపోతాడు. 'వోల్గానదీతల్లి' అనే గీతం ఆయన వాయిస్తూవుంటే మా అందరికీ ఎలా అనిపించిం దనుకున్నారు? ఎవరో దుఃఖిస్తున్నట్లుతోచింది. అబ్బ! ఎంత

అద్భుతంగా, మనోజ్ఞంగా వాయించాడు! ఇరుగుపొరుగున పని చేసే నౌకర్లంతా మన దొడ్డి గుమ్మం వద్దకువచ్చి అదేపనిగా వినసాగారు.'

'సరే, అతనికి కట్టుకోవడానికి దుస్తులుఇచ్చావా?' మళ్ళీ అడిగాడు యజమాని డెవిసోవ్.

'ఇచ్చాను అయ్యగారూ! మీరు రాత్రిపూట ధరించే చొక్కా ఇచ్చాను. పాపం. నిజానికి ఆలాంటి మనిషికి ఎంత సహాయం చేసినా తప్పులేదు. కల్ల, కపటం, ఎరుగని అమాయకుడు అయ్యగారూ!' అంటూ జాకర్, మళ్ళీ మంద హాసం చేశాడు.

'ఆయన నన్ను ఇంకా చాలా ప్రశ్నలు అడిగాడు. మీ అయ్యగారి ఉద్యోగం ఏమిటనీ, ఆయనకు ఊళ్ళో గొప్ప పలుకుబడివుందా అని, ఆస్థి ఎంతవుందనీ; ఇవన్నీ అడిగాడు.' అని చెప్పాడు జాకర్.

'సరే. అతనిప్పుడు ఎక్కడుందీ కనుక్కుందాం. కాని ఒక విషయం గుర్తుంచుకో. ఇహ ముందెప్పుడూ అతన్ని తాగనివ్వకు. అతను అడిగినాసరే బ్రాందీ ఇవ్వకు. తెలిసిందా? త్రాగాడూ అంటే అతని పరిస్థితి మరీ ఘోరంగా వుంటుంది.'

'నిజమే అయ్యగారూ! ఆయన విపరీతంగా తాగు తాడు, పైగా దుర్బలుడుకూడా. ఇదివరకు నేను పనిచేసిన అయ్యగారిదగ్గర ఇలాంటి గుమాస్తా ఒకాయన వుండేవాడు...'

ఆ గుమాస్తా కథంతా డెవిసోవ్ ఇదివరకే విన్నందున జాకర్‌ను మరేమీ చెప్పనీయకుండానే ఆపుచేశాడు. రాత్రికి

ఇంట్లో చేయాల్సిన పనులు చెప్పి, ఆల్‌బర్ట్ ఎక్కడున్నాడో వెదికి ఇంటికి పట్టుకురమ్మని అతన్ని పంపించాడు.

పిమ్మట డెలిసోవ్ తన పడకగదిలోకి వెళ్ళి దీపం ఆర్పుకుని పడుకున్నాడు. కాని ఎంతసేపటికీ నిద్రపట్టలేదు. అతని ఆలోచన అంతా ఆల్‌బర్ట్ మీదనేవుంది. 'నా స్నేహితులూ, నా పరిచయస్థులూ, అంతా ఇలాంటి వ్యర్థుణ్ణి ఇంట్లో పెట్టుకున్నావేమని అడుగుతారేమో? వాళ్ళు ఏమనుకున్నా ఫరవాలేదు. అతనికి నేను ఏమాత్రం మేలు చేయగలిగినా నా జన్మ సార్థకమవుతుంది. నాకు శక్తి వున్నంతవరకూ తోడ్పడతాను. అతనేం పిచ్చివాడుకాదు. ఆ తాగుడువల్లనే అతనలా అయిపోయాడు. అంతకన్నా అతనిలో చెడుగేమీలేదు. అతను వున్నందువల్ల నాకు ఖర్చుమాత్రం ఏముంది? అతని తాగుడుకు ఖర్చుపెట్టాల్సి వచ్చినా అది నాకేమంత భారమైనదికాదు కూడా. కొంతకాలం నావద్దనే వుంచుకుని అతన్ని ఒక మార్గంలో పెడతాను. తరువాత భగవంతుడు చల్లగా చూస్తే అతనికి ఏదో ఒక చక్కని ఆధారం దొరక్కపోదు. ఏం జరుగుతుందో చూద్దాం!' అని ఆలోచించుకోసాగాడు. డెలిసోవ్.

అలా అనుకునేసరికి అతని ఆత్మకు ఒకవిధమైన సంతృప్తి చేకూరింది. 'నేనేం చెడ్డవాణ్ణికాదు. ఇతరులతో పోల్చి చూచుకున్నప్పటికీ – నేను ఏమాత్రం చెడ్డవాణ్ణికాదు.' అనుకున్నాడు మళ్ళీ.

అతనికి నిద్ర తూలుతూవుండగా హాలులో తలుపులు తెరిచిన చప్పుడు, పాదముల సవ్వడి వినిపించాయి. వెంటనే అతనికి బాగా మెలుకువ వచ్చింది.

'ఇహనుంచి అతన్ని సరైన కట్టుబాట్లలో వుంచుతాను' అనుకున్నాడు తనలో.

జాకర్ తన పడకగదిలోకి రాగానే జెలిసోవ్ అడిగాడు.

'అతన్ని ఇంటికి తీసుకొచ్చావా ?'

'దురదృష్టవంతుడు అయ్యగారూ! ఏం చెప్పను!' అంటూ జాకర్ తల అటూ ఇటూ ఆడిస్తూ కళ్ళు మూసుకున్నాడు.

'ఏమిటి సంగతి ? అతను తాగి వున్నాడా ?'

'చాల బలహీనంగా వున్నాడు.'

'ఆ ఫిడేలు అతని దగ్గరే వుందా ?'

'నేనే తీసుకొచ్చాను. ఆ అమ్మగారు దాన్ని నా చేతికి ఇచ్చింది.'

'సరే. అతన్ని ఇప్పుడు ఇక్కడికి రానీయవద్దు. ప్రక్క ఏర్పాటుచేసి పడుకోబెట్టు. రేపు మాత్రం, ఏ పరిస్థితిలోనూ బయటికి వెళ్ళకుండా చూడు.'

యజమాని ఆజ్ఞ ప్రకారం జాకర్ అవతలికి వెళ్ళాడు. కాని అంతలోనే ఆల్బర్ట్, జెలిసోవ్ పడకగదిలో ప్రవేశించాడు.

# 5

'ఏం ? అప్పుడే నిద్ర వస్తోందా ?' మందహాసంతో ప్రశ్నించాడు ఆల్బర్ట్. 'నేను అన్నా ఇవ్నొవ్నా ఇంటికి

వెళ్ళాను. సాయంత్రమంతా చాలా కులాసాగా గడిపాను. పాటకచ్చేరి చేశాం. పగలబడి నవ్వుకున్నాం కబుర్లు చెప్పు కున్నాం. అక్కడ చాలమంది మిత్రులుకూడా సమకూడారు. ఒక గ్లాసు పానీయం కావాలి. మంచినీళ్ళు కాదు. ఏదో రకం బ్రాందీ కావాలి' అంటూ అతను టేబుల్ మీదనున్న గాజు గ్లాసు చేతిలోకి తీసుకున్నాడు.

గతరాత్రి విందులో ఎంత ఉల్లాసంగా వున్నాడో ఇప్పుడుకూడా అలాగే అగుపిస్తున్నాడతను. అదేరకంగా పెదవులమీద తొణికే చిరునవ్వు, కళ్ళల్లోను, ఫాలభాగంలోను కనుపించే అద్భుతమైన వెలుగు; అంతా అదేమాదిరి అవు రూపంగా అగుపిస్తున్నాడు. నౌకరు ఇచ్చిన దుస్తులనే ధరించి వున్నాడు. అతని చూపుల్లో శిశువుయొక్క అమాయకత్వం స్పష్టంగా కనిపిస్తోంది. అతను జెలిసోవ్ పక్కమీద కూచుని అతనివైపు నిశ్శబ్దంగా, కృతజ్ఞతాపూర్వకంగా చూస్తూ, మహా దానందంతో మందహాసం చేశాడు. జెలిసోవ్ కూడా అతని వైపు ఒకక్షణం చూచి, అతని మందహాసానికి ముగ్ధుడై పోయాడు. ఇంతలో అతని నిద్రి కాస్తా మటుమాయమై పోయింది. పైగా సంగీతం వినాలనీ, కొంతసేపు అతనితో గడపా లనీ కుతూహలం కలిగింది. తెల్లవారేదాకా అతనితో కులా సాగా గడపాలని నిశ్చయించుకున్నాడు. తను అంతకుముందు చేసుకున్న నిర్ణయాన్ని మరిచిపోయాడు. ఒక సీసా ద్రాక్ష సారాయి, సిగరెట్లు, ఫిడేలు తీసుకరమ్మని నౌకరును ఆజ్ఞా పించాడు.

'ఓ ! అద్భుతంగా వుంది !' అన్నాడు ఆల్‌బర్ట్. 'ఇంకా చాల రాత్రివుంది. సంగీతం పాడుకుందాం. నీకోసం ఎంతసేపు పాడమంటే అంతసేపు పాడుతాను.'

జాకర్ వెంటనే వెళ్ళి డ్రాయిసారాయి, మత్తుగావుండే కొన్ని సిగరెట్లు, ఫిడేలు తెచ్చి అక్కడ పెట్టాడు. తను కూడా నిద్రపోకుండా ప్రక్కగదిలో కూచున్నాడు.

'మనం కొంచెంసేపు మాట్లాడుకుందాం,' అన్నాడు జెలిసోవ్, ఆల్‌బర్ట్ ఫిడేలు చేతులోకి తీసుకుంటూ వుండగా. ఆల్‌బర్ట్, జెలిసోవ్ మంచంమీదకూచుని మరోసారి హాయిగా మందహాసం చేశాడు.

'అలాగే మాట్లాడుకుందాం' అన్నాడు ఆల్‌బర్ట్. అప్పుడతని మొహాకవళికలువిచిత్రంగా మారిపోయాయి. అవును అతను ఏదైనా మాట్లాడబోయేముందు మొహాంలో అద్భుతమైన మార్పువస్తుంది. 'ఒకమాట అడుగుతాను చెప్పండి' అంటూ అతనొక క్షణం ఆగాడు. 'గతరాత్రి మీతోవున్న ఆ పెద్దమనిషి – మీరు అతన్ని అని సంబోధించారు. అతను ఆ ప్రఖ్యాత 'N' కొడుకేనా?

'అవును. అతని స్వంతకొడుకు' అంటూ జెలిసోవ్ జవాబు చెప్పాడు, ఆ విషయంలో అతనికి ఎందుకంత ఆసక్తి కలిగిందా అని ఆలోచించుకుంటూ.

'అవును. నేనూ అదే అనుకున్నాను.' అన్నాడు, మళ్ళీ ఆల్‌బర్ట్ సంతృప్తి చెందినట్లు. 'అతని చర్యలను చూడగానే అతనొక గొప్పఇంటివాడని నాకు తోచింది. గొప్పవంశానికి చెందినవాళ్ళంటే నాకు అమిత ఇష్టం. ముఖ్యంగా

వారిలో ఒక విధమైన గర్వం, హుందాతనం, కనిపిస్తుంటాయి. నృత్యంచేసిన ఆ ఆఫీసరున్నాడే! అతనుకూడా నాకునచ్చాడు. మనిషి అతినాజూగ్గా వున్నాడు. నృత్యంకూడా అద్భుతంగా చేశాడు. అతనికీ ఆ 'N' కూ ఏమైనా సంబంధంవుందా?'

'అంటే, నీ వడిగేది ఎవర్ని గురించి?' ప్రశ్నించాడు డెలిసోవ్.

'అతనే. మనం నృత్యం చేసేటప్పుడు నన్ను వచ్చి తగిలాడే, అతను! చూడబోతే అతనుకూడా భలే సరదాయైన వాడిలా వున్నాడు.'

'కాదు, కాదు. అతను చాల సంకుచితమైన స్వభావం కలవాడు.'

'అలా అంటే నేను ఒప్పుకోను. డెలిసోవ్ చెప్పిన దాన్ని ఖండించడం మొదలెట్టాడు ఆల్బర్ట్. 'అతనిలో ఒక అద్భుతమైన శక్తి నాకు గోచరించింది. అతనికి సంగీతంలో మంచి ప్రజ్ఞ వుంది. అతను పాడినపాటవుంది చూచారూ? అలాంటివి పాడేవాళ్ళు చాల అరుదుగావున్నారు.'

'నిజమే. అతను బాగా పాడతాడు. కాని నాకు మాత్రం అతని పాటనచ్చదు. అతనికి సాంప్రదాయసిద్ధమైన సంగీతం తెలీదు. డొనీజెట్టీ, బెల్లినీ,—అతను వాయించలేడు. నీ ఉద్దేశ్యం ఏమిటి? నే చెప్పింది నిజమేనా?' అడిగాడు డెలిసోవ్, సంగీతాన్ని గురించి అతని అభిప్రాయాలేమిటో తెలుసుకుందామనే ఆసక్తితో.

'ఓ! అదికాదు. పూర్వకాలపు పద్ధతీ సంగీతమే. ఈ కాలపు పద్ధతిలో వాయించేదీ సంగీతమే. ఈ రెంటినీ మనం

కాదనలేము. కొత్త పద్ధతి అయినంత మాత్రాన దాన్ని మనం చిన్నచూపు చూడాల్సిన అవసరంలేదు. ఈనాటి సంగీతంలో సుందరమైన పోకడలు అనేకంవున్నాయి. 'సొన్నాంబ్యూలా, లూసియా, రోబర్ట్;' ఇవన్నీ చాల మంచి పద్ధతులు. ఇవి పాడుతూవుంటే నిజంగా మన హృదయాలు ద్రవించిపోతాయి. అన్నాడు ఆల్బర్ట్ ఏవేవో భావనలు, మనసులోకి తెచ్చు కుంటూ, ఆనందాతిరేకంతో.

'అయితే, ఈనాటి సంగీత నాటకాన్ని గురించి నీఅభిప్రా యం ఏమిటి?' మళ్ళీ ప్రశ్నించాడు డెలిసోన్.

'బోసియో, అద్భుతంగా పాడుతూ నృత్యంచేస్తుంది. కాని ఆమెపాట ఇక్కడికి చొచ్చుకునిపోదు.' అంటూ ఆల్బర్ట్ తన ఎండిపోయిన ఎదురురొమ్మును చూపించాడు. 'సంగీతా నికి ముఖ్యంగా వుండవలసిన లక్షణం హృదయాన్ని ద్రవింప చేయడం. ఆమెబాగానే పాడుతుందిగాని, ఆసంగీతానికి అలాంటి శక్తిలేదు. ఆమె తన పాటచేత ఆనందింపచేయ కలుగుతుంది గాని, అనుభూతిని కలిగించలేదు. అదే పెద్ద లోపం.'

'అయితే మరి, లాబ్లోషీ సంగతేమిటి?'

'అతన్ని గురించి నేను పారిస్‌లో విన్నాను. అప్పుడతను మాంచి పటుత్వంలోవుండి కచ్చేరీలు చేస్తున్నాడు. కాని ఇప్పుడు వృద్ధుడైపోయాడు. ఇప్పు డతనిలో కళోపాసికి ఉండా ల్సిన శక్తి లేదు.'

'అదేలా? వృద్ధుడైనంతమాత్రాన, కళాకారుడికి ప్రజ్ఞ నశిస్తుందా? నిజమైన కళామూర్తి వృద్ధుడైనా ఎప్పటికీ ఒకే

లాగున వుంటాడు. అలా లేనినాడు కళాకారుడని అనిపించుకోలేడు.' అన్నాడు మళ్ళీ డెలిసోవ్.

'అవును! మీరు చెప్పింది నేను కాదనను. నిజమైన కళాకారుడికి జరామరణాలు లేవు. అతను అనంతుడు! శాశ్వతుడు! శారీరకంగా వృద్ధుడైనా అతని కళాదేవతకిమాత్రం అది అంటదు. అన్నటికన్నా కళకు ముఖ్యమైంది అగ్నిజ్వాల! ఆ తపన ఎప్పుడూ జ్వలిస్తూవుంటుంది. అది చల్లారకుండా వున్నంత వరకూ కళోపాసికి మరణంలేదు.' అన్నాడు ఆల్‌బర్ట్ తన సన్నని చేతులు అటూ ఇటూ ఊపుతూ. అలా అనే టప్పుడు అతని నేత్రాలు మిలమల మెరిశాయి.

నిజంగా ఏదో అంతర్గర్భితమైన అగ్నిజ్వాల అతని శరీరమంతా దహించి వేస్తున్నట్టు కనిపించింది.

'ఓ! ఈశ్వరుడా!' అన్నాడతను పెద్దగా. 'పెట్రోవ్ అనే చిత్రకారుణ్ణి మీరు ఎరుగుదురా?' అడిగాడు మళ్ళీ.

'లేదు నేను ఎరుగను' అన్నాడు డెలిసోవ్ మెల్లగా.

'అతని పరిచయం మీకు కలిగితే ఎంత బాగుండును! ఒకసారి మీరు అతన్ని చూస్తే మళ్ళీ వదిలిపెట్టరు. అలాంటి వ్యక్తి! నేనతన్ని తరుచు అన్నా ఇవ్‌నోవ్ నా ఇంట్లో కలుసుకుంటూ వుంటాను. కాని ఇప్పుడామె అతనంటేఇష్టపడడం లేదు. ఏదో కారణాన కోపంగావుంటోంది. అతన్నిగురించి మీరు వివరంగా తెలుసుకున్నట్లయితే నేనెంతో ఆనందిస్తాను. అతను గొప్ప ప్రజ్ఞావంతుడు, గొప్ప ప్రజ్ఞావంతుడు!'

'ఇప్పుడతను బొమ్మలు గీస్తున్నాడా?' అడిగాడు డెలిసోవ్.

'ఏమో, నాకు తెలీదు. ఇప్పుడు గీయడం లేదను కుంటాను. కాని ఒకప్పుడు అతను గొప్ప ఆర్టిస్టు. ఎన్నో పత కాలు బహుమానాలు పొందాడు. ఓ! అతని భావాలు ఎలాంటివనుకున్నారూ? నేను వర్ణించలేను! ఎవరూ ఊహించని, ఊహించలేని భావాలు అతనికి తడతాయి. ఒక్కోసారి అతను మాట్లాడుతోంటే, మహదానందం కలుగుతుంది. నిజంగా పెట్రోవ్ గొప్ప ప్రతిభావంతుడు! కాని ఎప్పుడూ దుర్వ్యస నాలకు లోనై విలాసాలతో కాలం వెళ్ళబుచ్చుతుంటాడు... దురదృష్టవంతుడు.' అన్నాడు ఆల్బర్ట్ తిరిగీ మందహాసం చేస్తూ. అలా అంటూ అతను మంచంమీదనుంచి లేచి ఫిడేలు చేత పట్టుకున్నాడు.

'నీవు సంగీతనాటకాలలో పాల్గొని చాలాకాలమైందా?' అడిగాడు డెలిసోవ్.

ఆల్బర్ట్; గదిచుట్టూ కలయచూచి గట్టిగా నిట్టూర్పు విడిచాడు.

'ఓ! ఇహ నేను ఎప్పటికీ అందులో ప్రవేశించలేను. చెప్తాను వినండి!' అంటూ అతను మళ్ళీ మంచంమీదకూచుని డెలిసోవ్ చెవిలో రహస్యంగా చెప్పసాగాడు. 'నేను అక్కడికి వెళ్ళడం సాధ్యపడదు. వెళ్ళినా నేనందులో పాల్గొనలేను. ఓ! ఏం చెప్పను? నాదగ్గర ఏమీలేదు. వ్యర్థుణ్ణి అయిపోయాను. కట్టుకోడానికి దుస్తులేవు. ఉండడానికి ఇల్లులేదు. వాయించడానికి ఫిడేలు లేదు! ఏమీలేని దౌర్భాగ్యుణ్ణి! ఇహనేను సంగీత నాటకాల్లో ఎలా పాల్గొనగలను? హు! పనికిమాలిన జీవితం నాది! నిష్టదరిద్రుణ్ణి నేను!' అదేమాట పదేపదే ఉచ్చరిం

చాడు ఆల్బర్ట్. 'అయినా నేను అక్కడికి ఎందుకు వెళ్ళాలి? ఏం పని? వెళ్ళాల్సిన అవసరంలేదు!' అన్నాడు మళ్ళీ మంద హాసంచేస్తూ.

అలా అంటూ అతను తన తలను చేత్తో బాదుకున్నాడు. 'అయితే, అక్కడికి ఒకసారి మనిద్దరం కలిసి వెడదాం.' అన్నాడు డెలిసోవ్.

ఆ మాటకు జవాబు చెప్పకుండా ఆల్బర్ట్ పక్కమీద నుంచి అవతలికి దుమికాడు. ఫిడేలు పట్టుకుని 'ద్రోన్‌ప్యూయాన్' అంటూ వాయించడం మొదలెట్టాడు. అతను ఫిడేలు వాయిస్తోంటే డెలిసోవ్‌కు తల తిరిగిపోతున్నట్లు అనిపించింది.

'ఊహు. ఇవాళ నా పరిస్థితి బాగాలేదు. ఫిడేలు వాయించే స్థితిలో లేను.' అంటూ ఆల్బర్ట్ తన చేతిలో ఉన్న ఫిడేలు అవతల పెట్టాడు. 'నేను బాగా తాగాలి'

తరువాత అతను టేబుల్ వద్దకు వెళ్ళి ఒక పెద్దగాజు పాత్రనిండా ద్రాక్షసారాయి పోసుకున్నాడు. అదంతా ఒక గుక్కలో తాగేశాడు. మళ్ళీవచ్చి మంచంమీద డెలిసోవ్ ప్రక్కన కూచున్నాడు.

డెలిసోవ్ ఆల్బర్ట్ వంక రెప్పవాల్చకుండా చూచాడు. ఆల్బర్ట్ అతన్ని చూస్తూ మధ్యమధ్య మందహాసం చేస్తున్నాడు. ఇద్దరూ మౌనం వహించారు. కాని వాళ్ళచూపులు, చిరునవ్వులు, తలుచుకుంటూ, ఆ రెండు హృదయాలనూ అత్యంత సన్నిహితంగా చేశాయి. డెలిసోవ్‌కు ఆల్బర్ట్ మీద గాఢమైన ప్రేమ కలిగింది. వెంటనే అవ్యక్తమైన ఆనందానుభూతి కలిగింది.

'నీవు ఎప్పుడైనా ఎవరినైనా ప్రేమించావా?' అకస్మాత్తుగా అడిగాడు, డెలిసోవ్.

అది విని ఆల్బర్ట్ కొద్దిక్షణాలు ఆలోచించాడు మందహాసంచేసాడు. ఆ మందహాసంనుండి అనేక విషాదచ్ఛాయలు వెలువడి అతని మొహంనిండా వ్యాపించాయి. డిలిసోవ్ మీదికి వంగి అతనికళ్ళల్లోకి తీక్షణంగా చూచాడు.

'అలాంటి ప్రశ్న నన్నెందుకడిగారు.?' అన్నాడతను రహస్యంగా.

'అంతా మీతో చెపుతాను.మీరంటే నాకుఇష్టం.అంచాత నా విషయమంతా మీతో చెపుతాను.' అంటూ అతనివైపు నుండి దృష్టి మళ్ళించి ఒక క్షణం చుట్టూ కలయచూచాడు. మళ్ళీ చెప్పసాగాడు. 'మిమ్మల్ని నేను మోసగించను. మొదటి నుంచీ జరిగినదంతా ఉన్నది ఉన్నట్లు మీతో విన్నవిస్తాను.' అతను ఆగాడు. అతని కళ్ళు కౄరంగామారిపోయి నిశ్చలంగా వున్నాయి. 'నాకు మనోదౌర్బల్యం వుంది. మీకు తెలుసుగా! అవును. నా విషయమంతా అన్నా ఇవనోవ్నా ఇదివరకే మీతో చెప్పివుంటుంది. నేనొక పిచ్చివాణ్ణి అని ఆమె అందరితోనూ చెపుతూ వుంటుంది! అది నిజంకాదు. పరిహాసంకోసం అలా చెపుతూ వుంటుంది. ఆమె దయార్ద్ర హృదయురాలు. అయితే కొంతకాలం నాకు చిత్త చాంచల్యం కలిగిన మాట వాస్తవమే.' మళ్ళీ అతను సంభాషణ ఆపి వాకిలివైపు తీక్షణంగా చూచాడు. 'నీ వెవరినైనా ప్రేమించావా అని నన్ను మీరు ప్రశ్నించారు......అవును ప్రేమించాను.' అన్నాడు రహస్యంగా. 'అది జరిగి చాలాకాలమైంది. థియేటర్లో నేను

ఆర్టిస్టుగా పని చేస్తున్నప్పటిమాట అది! సంగీత రూపకాలలో నేను ఫిడేలు వాయిస్తూ వుండేవాణ్ణి. ఆమెకూడా అక్కడే వుండేది. రంగస్థలం ప్రక్కనే ఎడమవైపున కూర్చుని వుండేది.?'

అలా చెపుతూ ఆల్బర్ట్ లేచి డెలిసోన్ మీదికి వంగి అతని చెవిలో మళ్ళీ చెప్పాడు.

వద్దు. ఆమె పేరు నేనెందుకు చెప్పాలి! నిస్సందేహంగా మీరుకూడా ఆమెను ఎరుగుదురు. ఒక మీరేమిటి? అందరూ ఆమెను ఎరుగుదురు. నేను ఆమెను ఏమీచేయలేదు. మౌనంగా, నిశ్శబ్దంగా ఆమె వంక చూస్తూవుండేవాణ్ణి. అవును. నేను నిరుపేదను. దరిద్రంతో బాధపడుతోన్న ఆర్టిస్టును. మరి ఆమె ఒక గొప్ప ఇంటి స్త్రీ. శ్రీమంతురాలు. మాఇద్దరి మధ్యనున్న ఈ వ్యత్యాసం నేను బాగా ఎరుగుదును. అందుకే ఆమె వంక ఊరికనే చూస్తూ తృప్తిచెందేవాణ్ణి! అంతే! అంతకుతప్ప ఆమెను గురించి ఎలాంటి పన్నుగడలూ నా మనసులో లేవు.'

ఆల్బర్ట్ వెనుకటి విషయాలు జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్లు కనిపించాడు.

'అదెలా జరిగిందో నాకు గుర్తులేదు. కాని ఒకసారి నన్ను ఆమెతో కలిసి ఫిడేలు వాయించమని పిలిచారు...... మరి నాస్థితి ఏమిటి? ఒక నిర్భాగ్యుడైన ఆర్టిస్టును!' అంటూ అతను తలపంకించి మందహాసంచేశాడు. 'ఊహూ! ఆ విషయం మీతో చెప్పలేను......అప్పుడు నేనెంత ఆనందించాను!' అంటూ అతను తన తలను రెండు చేతులతో నొక్కుకున్నాడు.

'అయితే, నీవు తరుచు ఆమె ఇంటికి వెళ్ళేవాడివా?' డెలిసోవ్ ప్రశ్నించాడు.

'ఒక్క సారి! ఒక్కసారి మాత్రమే వెళ్ళాను......అది నేను బుద్ధిపూర్వకంగా చేసిన తప్పు. నాకు పిచ్చెక్కింది! నేను నిరుపేదనైన ఆర్టిసును, ఆమె ఒక శ్రీమంతురాలు. నేను ఆమెతో ఎలాంటి సంబంధం పెట్టుకోకుండా వుండాల్సింది. కాని నాకు మనశ్శాంచల్యంకలిగి మూర్ఖుడిలా ప్రవర్తించాను. దాంతో నా వ్యవహారమంతా తల్లక్రిందులైంది. పెట్రోవ్ నాకు అప్పుడే సలహా ఇచ్చాడు. థియేటర్‌వద్ద మాత్రమే ఆమెను చూస్తూ వుండవలసినదనీ, ఇంటికి వెళ్ళి మరేలాంటి సంబంధం పెట్టుకోవద్దనీ అతను చెప్పాడు. కాని, నేను... నేను...'

'ఏం జరిగింది? అక్కడికి వెళ్ళి నీవు ఏం చేశావు?' అడిగాడు మళ్ళీ డెలిసోవ్.

'ఓ! ఉండండి, ఉండండి! నే నా విషయాన్ని గురించి మాట్లాడ్తాను!' అంటూ ఆల్‌బర్ట్ తన రెండు చేతులతో మొహాన్ని కప్పుకుని కొంతసేపు మౌనంగా వున్నాడు.

'ఆరోజు నేను థియేటర్‌కు ఆలస్యంగా వెళ్ళాను. అవును. పెట్రోవ్, నేనూ, ఆ సాయంత్రం మల్లా తాగుతూ గడిపాం. నేను కాస్త తెలివి తప్పి వున్నాను. సరే. నేను థియేటర్‌కు వచ్చేసరికి ఆమె సోఫాలో కూర్చుని తన ప్రక్కనవున్న జనరల్‌తో మాట్లాడుతోంది. అతనెవరో నాకు తెలీదు. అతని వీపు వెనుక చేయి చాచుకుని మాట్లాడుతోంది ఆమె. తెల్లని దుస్తులు ధరించింది. మెళ్ళోముత్యాలహారం వేసుకుంది.

అతనితో మాట్లాడుతూనే నావంక చూచింది. అలా రెండు సార్లు చూచింది. ఆమె జుట్టు ఈ విధంగా వుంది. నేనప్పుడు ఫిడేలు వాయించడంలేదు. థియేటర్ యజమానుల పక్కని ఊరికనే నిలబడి ఆమెవంక చూచాను. నాకేదో విచిత్రభావం కలిగింది. అలా సంభవించడం అదే మొదటిసారి. జనరల్ వైపు చూస్తూ ఆమె నవ్వింది. వెంటనే నావంకచూచింది. ఆమె నన్నుగురించి అతనితో ఏదో చెబుతున్నదని నేను గ్రహించాను. అంతే! హఠాత్తుగా నేను ఆర్కెస్ట్రా వాళ్ళమధ్య లేకుండా పోయాను. వెళ్ళి సోఫాలో ఆమెప్రక్కన కూచుని, ఆమెచెయ్యి పట్టుకుని ... అదెలా సంభవించిందో, ఎందుకలా చేశానో నాకు తెలీదు. ఏంచేతనంటావు?' అన్నాడు ఆల్‌బర్ట్ ఒక్కక్షణం ఆగి.

'మరేంకాదు. అది నీవు ఊహించుకుంటున్నావు. అంతే' అన్నాడు డెలిసోవ్.

'కాదు, కాదు! ... కాని మీకావిషయం చెప్పడం నాచేతకావడంలేదు, ఎలాచెప్పను!...' బాధతో అతను మూలిగాడు. అప్పుడుకూడా నేను పేదరికంలోనే వున్నాను. ఉండడానికి ఇల్లులేదు. ఒక్కోసారి రాత్రంతా థియేటర్‌లోనే గడిపి అక్కడే పడుకునేవాణ్ణి.'

'ఏమిటీ? థియేటర్‌లోనా? ఆ చీకట్లో......ఎవరూ లేకుండా, ఒంటరిగా?......' ఆశ్చర్యపోతూ అడిగాడు డెలిసోవ్.

'ఓ! అలాంటివాటికి నేనెప్పుడూ భయపడను. కొంచెం ఆగండి......థియేటర్‌లో వాళ్ళంతా వెళ్ళిపోయిం తరువాత

ఆమె కూర్చునే సోఫా దగ్గరికి వెళ్ళేవాణ్ణి. పదేపదే ఆ సోఫా వంక చూస్తూ ఏవేవో ఊహించుకునేవాణ్ణి. చివరకు అందులోనే పడుకుని నిద్రపోయేవాణ్ణి. ఏమిటో! అలా చేయడం నాకో సరదా. ఓ! అక్కడ నేను గడిపిన రాత్రులు! ఆ రాత్రిళ్ళు నాకళ్ళకెన్నో దృశ్యాలు కనిపించేవి. మనసులో ఎన్నో ఊహాలు మెరిసేవి. అవన్నీ మీకు చెప్పలేను. ఇంతకన్నా ఎక్కువ చెప్పలేను.' అంటూ ఆల్బర్ట్ తలవొంచుకుని, కళ్ళు దించుకుని మళ్ళీ అడిగాడు. 'అదంతా ఏమిటంటారు ?'

'ఏమిటో మరీ, వింతగానేవుంది!' అన్నాడు డెలిసోవ్.

'కాదు. ఉండండి, ఉండండి!' అంటూ అతను మళ్ళీ డెలిసోవ్ చెవిలో రహస్యంగా చెప్పసాగాడు. 'నేనామె చేతిని ముద్దుపెట్టుకున్నాను. ఆమె శరీరంనుండి వెలువడే సుగంధ పరిమళాన్ని గట్టిగా పీల్చాను. ఆమె చెప్పేమాటలు విన్నాను. ఒక రాత్రి ఆమె నాతో ఎంతో ముచ్చటించింది. అప్పుడు నేను ఫిడేలు తీసుకుని మెల్లగా వాయించాను. ఎంత బాగా వాయించానో, ఎంత అద్భుతంగా పాడానో చెప్పలేను! కాని నాకు భయంకలిగింది. ఆపిచ్చిపిచ్చిపనులవల్ల కాదు నేను భయపడింది. వాటిమీద నాకు నమ్మకంలేదుకూడా. నా మెదడే నన్ను భయపెట్టింది. నా మనస్సే నన్ను మోసం చేసింది.' అంటూ అతను తల పట్టుకుని వెగటుగా ఒకసారి మందహాసం చేశాడు.

'నా విచిత్రమైన స్వభావం, నా అభిరుచులు; ఇవే నన్ను భయపెట్టాయి. నా మెదడుకు ఏదో ప్రమాదం సంభవించిందని అనుకున్నాను. ఒకవేళ అదేమీ కాదేమో! మీ ఉద్దేశ్యం ఏమిటి ?'

ఇద్దరూ కొన్ని నిముషాలపాటు మౌనంగా వున్నారు.

ఆల్‌బర్ట్ మెల్లగా చల్లగా ఒక పాట పాడాడు. మధ్య మధ్య చిరునవ్వు లొలికిస్తున్నాడు. 'నాకు కలిగిన స్థితి ఇలాంటిదే అనుకుంటా!' అంటూ అతను తను పాడినపాటలోని భావాన్ని ఉదాహరణగా చెప్పాడు. మళ్ళీ ఇలా అన్నాడు.

'నిజంగా ఆ వృద్ధుడైన పెట్రోవ్, ఇప్పుడిక్కడ ఉన్నట్లయితే ఆ విషయాలన్నీ మీకు బాగా అర్థమయ్యేలా చెప్పేవాడు.'

డెలిసోవ్ నిశ్శబ్దంగా, ఆల్‌బర్ట్ వంక చూచాడు. వెలవెల బోయిన అతని మొహం చూసేసరికి డెలిసోవ్‌కు భయంవృట్టింది.

'మీకు ఫ్ర్యూస్లైన్ వాల్‌జర్ విన్నారా?' అకస్మాత్తుగా అడిగాడు ఆల్‌బర్ట్! డెలిసోవ్ సమాధానం ఇవ్వకముందే ఫిడేలు తీసుకుని మహదానందంతో ఆపాట వాయించసాగాడు. తన్ను తాను మరిచిపోయి, స్వేచ్ఛగా, ఉల్లాసంగా ఫిడేలు వాయించసాగాడు ఆల్‌బర్ట్. అతనిచుట్టూ ఆర్కెస్ట్రా వున్నట్లు ఊహించుకుని పాటపాడుతూ ఫిడేలు వాయించాడు. మందహాసంచేశాడు. అభినయించాడు. అడుగులు వేస్తూ నృత్యం చేశాడు. తలపంకించాడు. ఓ! అద్భుతంగా, అత్యద్భుతంగా గానంచేశాడు ఆల్‌బర్ట్.

'ఓ! బ్రహ్మానందమైంది. ఇహ ఇవాల్టికి చాలిద్దాం' అన్నాడు అతను పాట పూర్తి చేసి, ఫిడేలు క్రిందికి దించుతూ.

కొంచెం సేపు కూర్చుని. 'ఇహానే వెడుతున్నాను. మీరు కూడా నాతో రారూ?' అని అడిగాడు అతను.

'ఎక్కడికి?' నిర్వికారపోయి ప్రశ్నించాడు డెలిసోవ్.

'మనం మళ్ళీ అన్నా ఇంటికి వెళదాం. అక్కడ ఎంతో ఆనందం!—సంగీతం, నృత్యం, అలజడి, మనుషులు; ఓ!...

మొదట్లో డెలిసోవ్ అంగీకరించాడు. కాని మళ్ళీ మనసు మార్చుకుని ఆల్బర్ట్‌ను, ఆ అంత రాత్రివేళ అక్కడికి వెళ్ళవద్దని చెప్పాడు. కాని ఆల్బర్ట్ వినలేదు.

'ఒక క్షణం వుండివస్తాను' అన్నాడు ఆల్బర్ట్.

'వద్దు. ఈవరకటప్పుడు అక్కడికి వెళ్ళడం అంత మంచిది కాదు.' ఆల్బర్ట్ నిట్టూర్పువిడిచి, ఫిడేలు అవతలపెట్టాడు.

'అయితే నేనిక్కడే ఉండాలా?' అంటూ టేబుల్ వైపు చూచాడు. (టేబుల్ మీద బ్రాందీ వుందేమో అని చూచాడుగాని అంతా అయిపోయింది.) 'వెళ్ళొస్తానని' అంటూ అతను గదిలోంచి ఇవతలికొచ్చాడు. డెలిసోవ్ 'కాలింగ్ బెల్' నొక్కి నౌకర్ని పిలిచాడు.

'ఆల్బర్ట్ బయిటికి వెళ్ళకుండా కనిపెట్టివుండు. నా ఉత్తర్వు లేందే అతన్ని ఎక్కడికీ వెళ్ళనీయకు తెలిసిందా?' అని చెప్పాడు నౌకరు జాకర్‌తో.

# 6

మర్నాడు సెలవురోజు. అప్పటికే డెలిసోవ్ నిద్రలేచి తన ఆఫీసు గదిలో కూచున్నాడు. కాఫీతాగుతూ ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. ప్రక్కగదిలో పడుకున్న ఆల్బర్ట్ అంత వరకూ లేచిన అలికిడిలేదు.

జాకర్, మెల్లగా భోజనశాల తలుపు తెరిచి లోపలికి చూచాడు.

'అయ్యగారూ! మీరు నమ్ముతారో నమ్మరోకాని, అతనింకా గాఢనిద్రలో వున్నాడు. ప్రక్కకూడా వేసుకో కుండా, పసి పిల్లవాడిమాదిరి కాళ్ళు చేతులు ముడుచుకొని ఆ సోఫాలో పడివున్నాడు.' అని చెప్పాడు జాకర్ యజమానితో.

మధ్యాహ్నంవేళకు గదిలోంచి మూలుగుడు, దగ్గడం, వినిపించింది. జాకర్ మళ్ళీ అక్కడికి వెళ్ళి చూచాడు. జాకర్‌కూ ఆల్‌బర్ట్‌కూ జరుగుతోన్న సంభాషణ డెలిసోవ్‌కు కొంచెం కొంచెం వినిపిస్తూనేవుంది.

జాకర్ తనవద్దకు రాగానే డెలిసోవ్ అడిగాడు.

'ఏం? ఎలా వున్నాడు?'

'ఏదో మూలుగుతున్నాడు అయ్యగారూ! మొహం కడుక్కోలేదు. మత్తుగా బద్ధకంగా ఉన్నాడు. బ్రాందీ కావా లంటున్నాడు.'

'వద్దు ఇవ్వొద్దు. అతని వ్యవహారం నేను ఆలోచిస్తాలే' అనుకున్నాడు డెలిసోవ్ తనలో.

బ్రాందీ ఇవ్వొద్దని నౌకరుకు ఉత్తర్వు చేశాడు.

తరువాత మళ్ళీ పుస్తకం చదువుకుంటూ ఏం జరుగు తుందో అని కనిపెడుతూ వున్నాడు. కాని ఆల్‌బర్ట్ వున్న గదిలోంచి అలికిడిలేదు. మధ్య మధ్య అతను దగ్గడం, కళ్ళె ఉమ్మేయడంమాత్రం వినిపిస్తోంది. అలా రెండు గంటలు గడిచాయి. డెలిసోవ్ దుస్తులు వేసుకుని బయటికి వెళ్ళిపోతూ

తన మిత్రుణ్ణి చూడాలనుకున్నాడు. ఆల్బర్ట్ కిటికీలో నిశ్చలంగా కూచునివున్నాడు. తలకు చెయ్యి ఆనించుకున్నాడు. అతని మొహం పసుపువర్ణంగావుంది. ముడతలుపడి ముడుచుకుని పోయింది. ఎక్కడలేని దిగులూ, చింతా అతని మొహంలో కనిపిస్తున్నాయి. చూస్తోంటే భయం వేస్తోందికూడా. డెలిసోవ్ వంకచూచి అతన్ని ఆహ్వానించడానికి మందహాసంచేయబోయాడు ఆల్బర్ట్. కాని సాధ్యంకాలేదు. ఇహ ఏడవడమే తరువాయి. అలావుంది అతని మొహం. కష్టంమీద లేచి వంగి నమస్కారం చేయబోయాడు.

'ఒక గ్లాసు సోడా అయినా ఇప్పించరూ? నేను చాల బలహీనంగా వున్నాను. దయచేసి ఇప్పించండి!' అన్నాడతను గద్గదస్వరంతో.

'కాఫీ తాగితే బడలిక తీరుతుంది. కొంచెం తాగు.' అన్నాడు డెలిసోవ్.

అకస్మాత్తుగా ఆల్బర్ట్ మొహం మరీ వివర్ణమైపోయింది. కళ్ళు చెమ్మగిల్లాయి. కుర్చీలో కూలబడ్డాడు.

'లేకపోతే ఏదైనా ఫలహారం చేస్తావా?' మళ్ళీ అడిగాడు డెలిసోవ్.

'వద్దు. థ్యాంక్స్. ఆకలిగాలేదు.'

'నీవు ఫిడేలు వాయించుకోవాలనుకుంటే, నాకేం అభ్యంతరంలేదు. నాపనికేమీ భంగంలేదుకూడా.' అంటూ డెలిసోవ్ ఫిడేలు తీసి టేబుల్ మీద పెట్టాడు.

ఆల్బర్ట్, ఏదో ద్వేషాన్ని వెలిబుచ్చుతోన్న మందహాసంతో ఫిడేలు వంక చూచాడు.

'వద్దు, నేను చాలా బలహీనంగావున్నాను ఇప్పుడు ఫిడేలు వాయించలేను.' అంటూ అతను ఎదురుగావున్న ఫిడేలును దూరంగా నెట్టివేశాడు.

అప్పటినుంచీ, డెలిసోవ్ ఏది అడిగినా అతను మారు చెప్పకుండా మౌనంగా, మూతి బిగించుకుని వుంటున్నాడు. వినయంగా వంగి తల ఆడించడం తప్ప, మరేం పలకడంలేదు. డెలిసోవ్ బయటికి వెళ్ళిపోయి తన పనులు ముగించుకుని మళ్ళీ సాయంత్రం వేళ ఇంటికొచ్చాడు. ఆల్బర్ట్ ఎలావున్నాడో అని ఆసక్తిగా పరిశీలించాడు. చీకటిగావున్న హాల్లో ఆల్బర్ట్ కూచుని వున్నాడు. రెండు చేతులూ తల వెనుక ఆనించుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. శుభ్రంగా వళ్ళు తోముకుని, మంచి దుస్తులు వేసుకున్నాడు. చక్కగా తలదువ్వుకున్నాడు. కాని కళ్ళు మాత్రం కాంతిహీనంగా వున్నాయి. అతని శరీరం యావత్తూ ఉదయంకంటె, బలహీనంగాను, బడలికగానువున్నట్లు కనిపిస్తోంది.

'భోంచేశావా ఆల్బర్ట్?' అడిగాడు డెలిసోవ్.

తిన్నానన్నట్లుగా ఆల్బర్ట్ తలూపాడు భయంకరంగా డెలిసోవ్ వెపు చూచాడు. తరువాత కళ్ళు దించేసుకున్నాడు డెలిసోవ్కు ఎంతో బాధ కలిగింది.

'నాటకశాల డైరెక్టర్తో నిన్ను గురించి ఇవాళ మాట్లాడాను. నిన్ను పనిలో పెట్టుకోవడానికి అతను సిద్ధంగావున్నాడు. కాని నీవు వాళ్ళమాట కాస్త వినాలి.' అన్నాడు డెలిసోవ్.

'నో. థ్యాంక్సు! నేను వాయించలేను.' అంటూ ఆల్బర్టు గభాలునలేచి అక్కణ్ణుంచి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

కొద్ది నిముషాల తరువాత అతను మళ్ళీ మెల్లగా తలుపు తెరుచుకుని డెలిసోవ్ వద్దకు వచ్చాడు. అతనిచేతిలో ఫిడేలుంది. డెలిసోవ్ వంక అదోలాచూచి వెంటనే ఫిడేలు, టేబుల్ మీద పెట్టి వెళ్ళిపోయాడు.

డెలిసోవ్ భుజాలెగరేసి తనలో తాను నవ్వుకున్నాడు.

'నేనేంచేయను ? నేచేసిన పనిలో తప్పేముంది ?' అను కున్నాడతను తనలో.

ఆ సాయంత్రం చాలా ప్రొద్దుపోయిన తరువాత ఇంటి కొచ్చాడు డెలిసాన్. రాగాన్నే నౌకర్ను ప్రశ్నించాడు. 'అత నెలావున్నాడు ?'

'ఏం చెప్పను ? అతని పరిస్థితి ఏం బాగులేదు. నిట్టూ ర్చడం, దగ్గడం తప్ప మరేం చేయడంలేదు. నాలుగైదుసార్లు వోడ్కా ఇవ్వమని బతిమాలాడు. చివరకు నేను ఒక గ్లాసు ఇచ్చాను.— లేదా అతన్ని మనం ఇక్కణ్ణుంచి పంపెయ్యడం మంచిది అయ్యగారూ! ఆ గుమాస్తానుగూడా అలాగే చేశారు' అని చెప్పారు జాకర్ స్పష్టంగా.

'అతను ఫిడేలు వాయించుకోలేదా ?'

'దాన్ని ముట్టుకోనుకూడా లేదు. రెండుసార్లు నేను చేతికివ్వబోయాను. కాని ఆయన దాన్నితీసుకుని మళ్ళీ అక్కడే పెట్టాడు. అయితే అయ్యగారూ! ఆయనకు బ్రాందీ ఇవ్వా ద్దంటారా?'

'వద్దు మనం ఇంకోరోజు ఇలాగే వుందాం. ఏం జరుగు తుందో చూద్దాం. ఇప్పుడేం చేస్తున్నాడు?'

"ఆఫీసుగదిలో వున్నాడు. లోపల తాళం వేసుకున్నాడు.'

డెలిసోవ్ తన పుస్తకాల బీరువాలోంచి కొన్ని ఫ్రెంచి గ్రంథాలు, జర్మన్ బైబులు, బయటికి తీశాడు,

'ఈపుస్తకాలు రేప్రొద్దున అతనిదగ్గరపెట్టు. బయటకెళ్ళకుండా మాత్రంచూస్తూవుండు' అని ఆజ్ఞాపించారు డెలిసోవ్.

మర్రోజు ఉదయం జాకర్, తన యజమానివద్దకువచ్చి రాత్రంతా ఆల్‌బర్ట్ నిద్రపోలేదని చెప్పాడు. గదిలో అటూ ఇటూ పిచ్చివాడిలా తిరిగాడనీ, తరువాత మనగేటు దగ్గిరికి వెళ్ళి తలుపులు తీసుకొని బయిటికి వెళ్ళాలని యత్నించాడనీ చెప్పాడు. కాని నౌకరు ముందే అన్నివాకిళ్ళకూ తాళాలు వేసినందున అదిసాధ్యపడ్లేదు. చీకట్లో పడుకుని తనలో తాను గొణుక్కుంటూ చేతు లాడించుకుంటూ రాత్రంతా గడపాడిని చెప్పాడు..

రోజురోజుకు ఆల్‌బర్ట్ చాలబలహీనంగా, బడకంగా, వుంటున్నాడు. డెలిసోవ్ అంటే అతను భయపడుతున్నట్లుగా వుంది. వాళ్ళిద్దరూ ఒకర్నొకరు, చూచుకున్నప్పుడు ఆల్‌బర్ట్ మొహం విపరీతమైన భయంతో వణికిపోతోంది. డెలిసోవ్ ఇచ్చిన గ్రంథాలుగాని, ఫిడేలుగాని అతను ముట్టుకోలేదు. డెలిసోవ్ ఎన్ని ప్రశ్నలు వేస్తున్నా జవాబు చెప్పడంలేదు.

ఆల్‌బర్టు అక్కడకు వచ్చి అది మూడో రోజు. ఆ నాడు డెలిసోవ్ చాల ఆలస్యంగా ఇంటికొచ్చాడు. అలసిపోయి, మనిషి అదోలా ఆందోళనగా వున్నాడు. తన స్వంత వ్యవహారంకోసం చాలదూరం, వెళ్ళడం. శ్రమపడడం జరిగింది.

క్లబ్‌కు వెళ్ళి అక్కడ ఆటలో ఓడిపోవడంకూడా తటస్థించింది. అంచాత అతని మనస్సు ఏమాత్రం బాగా లేదు.

'సరే. అతనిష్టం వచ్చినట్లు చేసుకోనీయ్' అని చెప్పాడు జాకర్‌తో, ఆల్‌బర్టు పరిస్థితి ఏం సరిగా లేదని అతను చెప్పగావిని.

"రేపు అతనితో ఖచ్చితంగా చెప్పదలచాను. 'నా సలహా ప్రకారం నడుచుకోదలిస్తే ఇక్కడవుండు. లేకపోతే నీ ఇష్టం ఎక్కడికైనా వెళ్ళొచ్చు' అని చెప్తాను. నేను చేయ గలిగినదంతా చేశాను. ఇంకేం చేస్తాను?" అని నిర్మొహమాటంగా చెప్పాడు డెలిసోవ్ తన నౌకరుతో.

అలా నిశ్చయించుకునేసరికి డెలిసోవ్ మనస్సంతా ఆలోచనలతో నిండిపోయింది. మనుషులకు మంచిచేయాలని ప్రయత్నిస్తే ఇలాగే జరుగుతుంది. తప్పదు. అతనికోసం నేను నానా అగచాట్లు పడ్డాను. ఆ దౌర్భాగ్యుణ్ణి తెచ్చుకుని ఇంట్లో పెట్టుకున్నాను. నాతో సమానమైన స్థానం ఇచ్చి ఆదరించాను. అతన్నిక్కడ ఉంచుకున్నందువల్ల నే నాతో సంబంధంగల వ్యక్తులంతా నన్నుచూచి అసహ్యించుకుంటున్నారు. ఇవాళ ప్రొద్దున నన్నుచూడ్డానికి వచ్చిన ఒక పెద్దమనిషి అతడున్నాడని ఇంట్లోకి రాలేదు. నావైపు అసహ్యించుకుంటూ, చూచాడు. హు! అతనికి ఎంతచేసినా జ్ఞానంరావడంలేదు. తనంతటతానే మొహం ముడుచుకుని కూచుంటున్నాడు. తన మంచిగురించి తనేమాత్రం శ్రద్ధ తీసుకోడు. అతను నన్ను ద్వేషించడానికి కారణం ఏమిటి? ఎందుకలా బాధపడుతున్నాడు? నేనేం చేశానని? అధోగతిలో వున్నవాణ్ణి తెచ్చి నెత్తిన పెట్టుకున్నాను, ఆదరించాను. పతనమైపోతుంటే కాపాడదామనుకున్నాను. మంచి మార్గాన

మళ్ళించి అతని జీవితం సుఖవంతం చేయాలనుకున్నాను. ఇవన్నీ నా నేరాలా?.........

'వద్దు, ఇదంతా నా పిచ్చి. మనుషుల్ని బాగుచేయడం మన సాధ్యంకాదు. భగవంతుడు వాళ్ళ కలా రాసిపెట్టివుంటే, నేను బాగుచేయాలను కోవడం శుద్ధ తెలివితక్కువ. నేను పసివాడిలా ప్రవర్తించాను. నన్ను నేనే బాగుపరుచుకోలేను. ఇహ ఇతర్లనెలా బాగుచేస్తాను?' అలా ఆలోచించుకుని డెలిసోవ్, వెంటనే ఆల్‌బర్ట్‌ను తన ఇంట్లోంచి వెళ్ళిపొమ్మని చెప్పుదా మనుకున్నాడు. కాని ఒక క్షణం మళ్ళీ ఆలోచించుకుని ఆ పని మర్నాటికి వాయిదా వేసుకున్నాడు.

ఆ రాత్రి డెలిసోవ్ యథాప్రకారం నిద్రపోతూవుండగా హాలులో టేబుల్ క్రిందపడిన చప్పుడైంది. వెంటనే అతను మేల్కొన్నాడు. అప్పుడు మనుషుల మాటలు, అడుగుల సవ్వడి వినిపించాయి. కొవ్వొత్తి వెలిగించి ఏం జరుగుతోందా అని వినసాగాడు.

'కొంచెం ఆగండి...నేను మా అయ్యగారితో చెప్తాను.' అంటున్నాడు నౌకరు జాకర్.

ఆల్‌బర్ట్ ఏదో కోపంగా గొణుగుతున్నాడు. అది విని డెలిసోవ్ కొవ్వొత్తి తీసుకుని హాలులోకి పరుగెత్తాడు. జాకర్ వాకిలికి అడ్డంగా నిలబడిఉన్నాడు. ఆల్‌బర్ట్ అతన్ని తోసుకుంటూ బయటికి వెళ్ళిపోవడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. పెద్దగా కేకలు పెడుతున్నాడు.

"మీరు నన్నిక్కడ బంధించడానికి వీలులేదు! నా దగ్గర ప్యాస్‌పోర్టు వుంది.* మీవద్దనుంచి నేనేం తీసుకపోవడంలేదు. కావాలంటే సోదాచేసుకో. నీవు నన్ను వెళ్ళనీయకపోతే సరాసరి పోలీసు అధికారికి రిపోర్టు చేస్తాను.' భయంకరంగా అరుస్తున్నాడు ఆల్‌బర్ట్.

'క్షమించండి అయ్యగారూ!' అన్నాడు జాకరు తన యజమాన్ని చూచి 'ఆయనగారు అర్ధరాత్రివేళలేచి నాకోటులో వున్న తాళంచెవి తీసుకున్నారు. దాంతో బీరువా తాళంతీసి లోపలున్న వోడ్కా, బ్రాందీ. మొత్తం చుక్క మిగలకుండా తాగేశాడు. ఏం పని ఇది – మీరే చెప్పండి! ఇహ ఇప్పుడేం బయటికి పోవాలని గోలచేస్తున్నారు. మీరేమో ఆయన్ను ఎక్కడికీ వెళ్ళనీయొద్దని నాకు ఉత్తర్వు చేశారు. అంచాత నేను అడ్డగిస్తున్నాను.'

డెలిసోవ్‌ను చూడగానే ఆల్‌బర్ట్ కంఠస్వరం మరీ హెచ్చించి ఆవేశంతో అరవసాగాడు.

'నన్ను మీ రెవ్వరూ ఆపలేరు! ఆపని చేయడానికి మీకేం అధికారముంది?......'చాలా తీవ్రంగా అరుస్తున్నాడు ఆల్‌బర్ట్.'

'జాకర్! నీవు అవతలికి తప్పుకో!' అన్నాడు డెలిసావ్.

'నిన్ను నేనెందుకాపుతాను? అలా చెయ్యాలనికూడా అనుకోవడంలేదు ఆల్‌బర్టు! కాని తెల్లవారేవరకైనా ఇక్క

* రాత్రిగాని పగలుగాని ఎక్కడికిబడితే అక్కడికి స్వేచ్ఛగా వెళ్ళడానికి పోలీసువారు ఇచ్చే అధికారపత్రం.

డుండమని సలహా ఇచ్చాను. అంతే'అన్నాడు డెలిసొవ్, ఆల్‌బర్టుతో.

'నన్నెవరూ ఆపలేరు! నేను సరాసరి పోలీసు అధికారి వద్దకు వెడతాను!' అదేమాట అంటూ పెద్దగా అరవసాగాడు ఆల్‌బర్టు. అతను డెలిసొవ్ వైపు చూడకుండా జాకరును ఉద్దేసించే అలా అంటున్నాడు. అకస్మాత్తుగా మధ్యలో – 'సహాయం! రక్షించండి!' అని భయంకరమైన కంఠంతో అరిచాడు ఆల్‌బర్టు.

'ఎందుకలా అరుస్తారు? మిమ్మల్ని ఎవరూ అడ్డగించడం లేదు.' అంటూ జాకర్ తలుపులుతీసి, అవతలికి తప్పుకున్నాడు.

ఆల్‌బర్టు కేకవెయ్యడం మానుకున్నాడు. 'మీరే ఓడిపోయారు. నన్ను ఆపాలనుకున్నారు. కాని మీ తరమా! మీరే ఓడిపోయారు.' అంటూ తనలో తాను గొణుక్కున్నాడు. పిమ్మట చెప్పులు తొడుక్కొని సరాసరి బయటికి వెళ్ళిపోయాడు. జాకర్ మాత్రం అతనికి బయటి గేటుదాకా దీపం చూపించాడు. పిమ్మట వెనక్కి వచ్చాడు.

'అయ్యగారూ! పోనీయండి మనమేంచేస్తాం. ఆయనే వెళ్ళిపోయాడు. దేవుడెలా పెడితే అలా జరుగుతుంది. ఆయనకు.' అన్నాడు జాకర్, యజమానితో.

డెలిసొవ్ ఏం మాట్లాడకుండా తలూపి ఊరుకున్నాడు. అతనికి జ్ఞాపకాలొచ్చాయి. ఆల్‌బర్టును తనతో తీసుకొచ్చిన రాత్రి, ఆ రాత్రి అతను వాయించిన ఫిడేలు సంగీతం, గుర్తుకొచ్చాయి. మరుసటిరోజు అతను తనతో ప్రేమగా చెప్పిన సంగతులు, అతను పాడినగీతాలు అన్నీ ఒక్కసారి మనసులో మెదిలాయి. సంగీతంలో అతనికిగల పాండిత్యాన్ని అద్భుతమైన

ప్రజ్ఞను, తలుచుకునేసరికి డెలిసోవ్‌కు నిర్భాగ్యుడైన ఆల్‌బర్ట్ మీద మళ్ళీ జాలిపుట్టుకొచ్చింది. 'అయ్యో! అతనేమైపోతాడో కదా? దగ్గర డబ్బులేదు. చలికి ఆగే దుస్తులుకూడా వంటి మీదలేవు. పైగా అర్ధరాత్రి. ఒంటరిగా వెళ్ళాడు. ఎక్కడికి పోతాడో? ఏమవుతాడో?......' మనసులో బాధపడ్డాడు డెలిసోవ్. వెతకడానికి జాకర్‌ను పంపిద్దామనుకున్నాడు. కాని అప్పటికే ఆల్‌బర్టు వెళ్ళిపోయి చాలాసేపయింది.

'బయట బాగా చలిగావుందా?' అడిగాడు నౌకర్ను.

అవును అయ్యగారూ! దట్టంగా మంచుపడుతోంది. మీతో చెప్పడం మరిచాను అయ్యగారూ! ఇప్పుడే వసంతం వెళ్ళకముందే, వంటచెరకు మరింత కొనుక్కొని నిల్వచేసుకోవాలి. లేకపోతే చిక్కొస్తుంది,' అన్నాడు జాకర్.

'ఇంకా కొంత ఉందని చెప్పావుగా? తరువాత చూద్దాంలే.'

# 7

అవును. బయట మంచుపడుతోంది. చాలా చలిగా వుంది. కాని ఆల్‌బర్టు బాగా తాగివున్నాడు. వళ్ళంతా వేడెక్కి మాంచినిషాలో వున్నాడు అంచాత అతనికి ఆ చలిబాధ ఏ మాత్రం తెలీడంలేదు. రోడ్డుమీదికివచ్చి చుట్టూ కలయచూచాడు. ఆబంధిఖానాలోంచి బయటపడ్డాను కదా అని సంతోషించాడు. చేతులు రుద్దుకున్నాడు. వీధి అంతా నిర్మానుష్యంగావుంది. వరుసగా వున్న వీధిలాంతర్లు ఎర్రని కాంతితో ప్రకా

కేస్తున్నాయి' ఆకాశం నిర్మలంగా నక్షత్రాలతో నిండి ఉంది. 'అదిగో! అగుపిస్తూనేఉంది.' అనుకున్నాడతను తనలో తాను. జెలిషోవ్ ఇంట్లో కిటికీలోంచి దీపం వెలుతురు కనిపించడం చూచి, రెండు చేతులూ పాంటు జేబుల్లో తురుముకొని ముందుకు తూలుతూ నడుస్తున్నాడు, బరువుగా, బద్ధకంగా పోతున్నాడు. అడుగులు అడ్డదిడ్డంగా వేసుకుంటూ నడుస్తున్నాడు. కాళ్ళల్లోనూ పొట్టలోనూ ఏదో బరువుగా వున్నట్లు అనిపిస్తోంది అతనికి. తలలో ఏదో అసాధారణమైన ధ్వనులు చేస్తున్నట్లుగా వుంది ఏదో తెలియని శక్తి అతన్ని అటూ ఇటూ నెడుతోంది. అయినా అతను సూటిగా 'అన్నా' ఇంటివైపే నడుస్తున్నాడు. విచిత్రము, విరుద్ధము, అసంగతము అయిన ఆలోచనలు అనేకం బుర్రలోకి వస్తున్నాయి. జాకర్‌తో చివరిసారి తాను ఎదిరించి మాట్లాడడం గుర్తుకొచ్చింది. పిమ్మట మొదటిసారిగా తాను స్టీమ్‌బోట్ ఎక్కి రష్యాకు రావడం, ఆరాత్రి ఒక స్నేహితుడి షాపులో హాయిగా గడపడం జ్ఞాపకమొచ్చింది. ఆతరువాత థియేటర్‌లో తను ఎన్నో మధుర స్వప్నాలు గన్న రాత్రులు, ముఖ్యంగా ఆమెను ప్రేమించి కామించి, చేసిన చేష్టలు అన్నీ గుర్తుకొచ్చాయి. ఇన్ని దృశ్యాలు ఒక్కసారిగా మనసులో మెదిలేసరికి అతను పిచ్చివాడిలా అయిపోయాడు. తను ఎటు వెడుతున్నదీ, ఏం చేస్తున్నదీ, తన కళ్ళముందు కనిపించే దృశ్యాలన్నీ నిజమైనదీ, కానిదీ, ఏమీ తెలుసుకోలేని స్థితిలో వున్నాడు. మధ్య మధ్య కళ్ళు మూతలుపడుతున్నాయి. అతను నడుస్తున్నాడా లేక తేలిపోతున్నాడా ? ఠపీమనీ వెళ్ళి ఒక గోడకు కొట్టుకున్నాడు. వీధి తరువాత వీధి ఒక సందు తరువాత మరొక సందు దాటేసి పోతున్నాడు.

మొర్‌స్కాయా అనే చిన్న వీధిలోంచి పోతోండగా ఆల్‌బర్ట్ తూలి క్రింద పడిపోయాడు. ఒక క్షణం తరువాత తెలివి వచ్చి కళ్ళు తెరిచిచూచాడు. ఎదురుగా ఒక పెద్ద రమణీయమైన భవనం కనిపించింది. లేచి వెళ్ళి పోసాగాడు. ఆకాశంలో నక్షత్రాలు లేవు – చంద్రుడు లేడు. పోనీ సూర్యోదయం అవుతుందేమోఅంటే అదీ కనిపించడంలేదు. వీధుల్లో దీపాలు లేవు. ఏమిటో అంతా అయోమయంగావుంది. వీధి చివర ఆ భవనం వుంది. ఎత్తయిన భవనం కిటికీల్లోంచి దీప కాంతి కనిపిస్తోంది. ఆ దీపకాంతి ఆల్‌బర్ట్‌కు మసక మసగ్గా అగుపిసోంది. భవనంమాత్రం పోను పోను దగ్గరగా, స్పష్టంగా కనుపించసాగింది. కాని తీరా గేట్లుగుండా లోపలికి వెళ్ళేసరికి దీపకాంతి మాయమైంది. లోపల అంతా చీకటి. ముందరి కడ అడుగుల సవ్వడిమాత్రం వినిపించింది. ఏవో నీడలు అస్పష్టంగా గోచరించాయి. 'నేను ఇక్కడి కెందుకొచ్చాను? ' అని ప్రశ్నించుకున్నాడు తనలో తాను కాని ఏదో శక్తి అతన్ని నెట్టుకుంటూ హాలులోకి తీసుకెళ్ళింది. అక్కడొక ప్లాట్‌ఫారం లాంటిది వుంది. దానిమీద చిన్న చిన్న మానవ రూపాలు నిశ్శబ్దంగా నిలబడి వున్నాయి.

'ఎవరు వాళ్లు ?' అడిగాడు ఆల్‌బర్ట్. కాని ఎవరూ జవాబు చెప్పలేదు. ఒకడుమాత్రం ప్లాట్‌ఫారం పక్కకు చేతి సైగతో చూపించాడు. అక్కడ ఒక పొడుగాటి సన్నని మనిషి రాత్రిపూట వేసుకునే రంగు రంగుల గౌను వేసుకుని నిలబడి వున్నాడు. అతన్ని చూడగానే ఆల్‌బర్ట్ గుర్తించాడు, తన స్నేహితుడు పెట్రోవ్ అని. 'అరె, వింతగావుందే! ఇతను

ఇక్కడికెలా వచ్చాడు ?' అనుకున్నాడతను. అంతలో పెట్రోవ్ అక్కడున్న వారిని ఉద్దేశిస్తూ ఇలాఅంటున్నాడు. 'సోదరులారా! మీ అభిప్రాయం పొరపాటు. మీ మధ్య జీవించే ఒక మనిషినే మీరు అర్థం చేసుకోలేరు. మీరు అతన్ని అర్థం చేసుకోలేరు! అతను అసమర్థుడైన ఆర్టిస్టు కాదు. వెర్రివాడు కాదు. వ్యర్థుడైన మనిషీ కాదు. అతను అద్భుతమైన ప్రజ్ఞావంతుడు మేధావి— సాటిలేని సంగీత విద్వాంసుడు. మీరంతా అతన్ని నిరాదరణతో గుర్తించనందున పతనమైపోయాడు. అంతే!' అతను ఎవర్ని గురించి మాట్లాడుతున్నదీ ఆల్బర్టుకు వెంటనే అర్థమైంది. వంగి పెట్రోవ్‌కు నమస్కారం చేశాడు.

'మీరంతా అతన్ని ఏమైనా అనవచ్చు, ఎన్నిరకాలుగానైనా నిందించవచ్చు. కాని అతను ప్రతిభావంతుడు. దైవదత్తమైన శక్తి అతనిలో వుంది. మీరు అవమానించినంతమాత్రాన అతని ప్రజ్ఞకు లోటురాదు. మీరెన్ని అనుకున్నా అతను మీ అందరికంటె గొప్పవాడు – సందేహంలేదు. అతను దయగలవాడు. సుఖి, భోగి. అతను అందర్నీ సమానంగానే చూస్తాడు. ముఖ్యంగా సౌందర్యాన్ని ప్రేమిస్తాడు, ఆరాధిస్తాడు. దైవసృష్టి, మానవాతీతము, అయిన ఆ సౌందర్యాన్ని అత్యధికంగా ఆరాధిస్తాడు. అవును. అతనే నిజమైన మనిషి! మీ తప్పుడు ఆలోచనలు, అభిప్రాయాలు పోగొట్టుకుని అతనికి నమస్కరించండి. మోకరిల్లి ప్రార్థించండి!' పెద్దగా ఉపన్యసిస్తున్నాడు పెట్రోవ్.

కాని హాలులో అవతలి మూలనుంచి ఒక కంఠస్వరం వినిపించింది. 'నేను అతని కెందుకు నమస్కరించాలి?' అది డెలిసోవ్ కంఠస్వరమని ఆలుబర్ట్ గ్రహించాడు. ఏమి టతని

గొప్పదనం ? అతనిముందు నే నెందుకు మోకరిల్లాలి? అతను అందరిపట్ల మర్యాదగా ప్రవర్తిస్తున్నాడా ? అతనివల్ల సమాజానికి ఏమైనా ప్రయోజనముందా? ఎంతమందిదగ్గర ఎన్నిసార్లు డబ్బు అప్పుగా తీసుకుని ఎగవేశాడు ? తోటి ఆర్టిస్టులవద్ద ఫిడేళ్ళు తీసుకుని వాటిని కుదువపెట్టి సొమ్ము తీసుకున్నాడు ? ......'ఓ! ఈశ్వరుడా ! డెలిసోవ్‌కు ఈ విషయాలన్నీ ఎలా తెలిశాయి?' అనుకుంటూ ఆల్బర్ట్ ఇంకా తలొంచుకుని నిలబడ్డాడు. డబ్బుకోసం అతను ఎంతమంది దగ్గర ఇచ్చకాలు పలికాడో తెలీదూ ? థియేటర్‌నుంచి అతన్ని ఎందుకు వెళ్ళగొట్టారో మా అందరికీ తెలీదనుకున్నావా ? అన్నా ఇవనోవ్‌నా అతన్ని పోలీసులకుఅప్పచెప్పాలని ప్రయత్నించిందే ఎందుకని ? 'ఆ భగవంతుడా ! ఇవన్నీ సత్యమే. వీటికి నేనేం జవాబు చెప్పేది' అనుకుంటున్నాడు ఆల్బర్ట్. అంటూ డెలిసోవ్ తీవ్రంగా పెట్రోవ్ అభిప్రాయాలను ఖండించాడు.

'ఇహ అంతటితో ఆపు ! సిగ్గుచేటు !' మళ్ళీ పెట్రోవ్ అరవడం వినిపించింది 'అతన్ని నిందించడానికి నీకేం హక్కుంది? అతను ఎలాంటి జీవితం గడిపాడో నీకు తెలుసునా? అతనిలా నీవు జీవించావా ? అతను పొందిన అనుభవాలు నీకు వున్నాయా ? ('నిజం, నిజం !' అనుకున్నాడు ఆల్బర్ట్) కళ అనేది మహోన్నతమైన శక్తి. కళాకారుడు మానవాతీతుడు. అతనితో పోటీ మరొకరులేరు. అతన్ని అర్థం చేసుకునేశక్తి లేక పిచ్చివాడంటారు. కళాసాధనలో అనేకమంది మహానుభావులు ఆత్మలు బలిచేసుకున్నారు. జీవితాల్ని అంకితమిచ్చారు. సంకేతస్థలాన్ని చేరుకోలేక, ఆశయ సిద్ధిని పొందలేక అనేకమంది

విఫలులైపోయారు కూడా.' అంటూ పెట్రోవ్ ఆగాడు. అప్పుడు ఆల్‌బర్ట్ తలెత్తి ('సత్యం, సత్యం! అని అరిచాడు. కాని అతని కంఠస్వరం పెగల్లేదు.)

'అతని విషయం నీకు సంబంధించిందికాదు.' మళ్ళీ వాదించసాగాడు పెట్రోవ్. 'నీ ఇష్టం వచ్చినట్లు అతన్ని అవమానించు. అయినా అతను మీ అందరికంటె గొప్పవాడు. నిస్సందేహముగా గొప్పవాడు. ఆనందమయుడు, సౌఖ్యవంతుడు!'

ఆ మాటలు వింటున్నకొద్దీ ఆల్‌బర్ట్ సంతోషం పట్టలేకపోయాడు. ఆనందంతో వెళ్ళి తన స్నేహితుడు పెట్రోవ్‌ను ముద్దుపెట్టుకుందామని వెళ్ళాడు.

'వెళ్ళు! నీ వెవరో నాకు తెలేదు. నీదోవన నీవు వెళ్ళిపో!' అని అరిచాడు పెట్రోవ్.

'నీవు తప్పతాగివున్నావు! నీవక్కడికి వెళ్ళడానికి వీల్లేదు' అరిచాడు అడ్డరోడ్డుదగ్గర నిలబడివున్న ఒక పోలీసువాడు.

ఆల్‌బర్ట్ ఒకక్షణం ఆగి తనశక్తినంతా కూడకట్టుకుని ఎవరివల్లా అపాయం రాకుండా వుండాలని ప్రక్క వీధిలోకి మళ్ళాడు.

అన్నా ఇల్లు కొద్ది అడుగుల దూరంలోనే వుంది. ఆమె భవనం ముందు హాలులోంచి దీపకాంతి ముందుఖాళీ జాగాలో పడుతోంది. గేటుదగ్గర, స్లెడ్జిబండ్లు, గుర్రబ్బగ్గీలు నిలబడి వున్నాయి.

వణుకుతోన్న చేతులతో గోడ పట్టుకుని గబగబ మెట్లెక్కాడు ఆల్‌బర్ట్టు. కాలింగ్‌బెల్ నొక్కాడు. నిద్రమత్తులో వున్న ఒక పరిచారిక తలుపుతీసింది. ఆల్‌బర్ట్టు వంక కోపంగా చూచింది. 'నీవు లోపలికి రావడానికి వీల్లేదు. ఉత్తర్వులేదు.' అంటూ గభాలున తలుపు మూసుకుని తిరిగి లోపలికెళ్ళిపోయింది. లోపల్నుంచి సంగీతం, అనేకమంది స్త్రీల కంఠస్వరాలు, వినిపిస్తున్నాయి. ఆల్‌బర్ట్టు తల గోడ కానించుకుని మెట్లమీద కూచున్నాడు. కళ్ళు మూసుకున్నాడు. అతని మనస్సులో అనేకభావాలు తరంగాలమాదిరి లేచాయి. సుందరమైన స్వాప్నిక జగత్తులోకి వెళ్ళిపోయాడు. 'అవును. అతను లోకంలో అందరికంటె సౌఖ్యవంతుడు. సత్పురుషుడు!' అనే ఊహ అతనికి తట్టింది. లోపల్నుంచి పియానోల సంగీతం వినిపిస్తోంది. దగ్గరలోవున్న చర్చిలోంచి ప్రభాతగీతాలు, గంటలు గణగణమ్రోతలు వినవస్తున్నాయి. 'అవును. అతను సౌఖ్యవంతుడు, సత్పురుషుడు!' అని పలికాయి ఆ గంటల ధ్వనులు కూడా......

'నేను మళ్ళీ అక్కడికి వెడతాను' అనుకున్నాడు ఆల్‌బర్ట్టు.

'పెట్రోవ్ నన్ను గురించి బాగా సమర్థించి చెప్పాడు'. కాని అక్కడ హాలులో ఇప్పుడు ఎవరూ లేరు. ఆర్టిస్టు పెట్రోవ్ మాత్రం వున్నాడు. ఆల్‌బర్ట్టు ప్లాట్‌ఫారందూద నిలబడి గొప్పగా ఫిడేలు వాయిస్తున్నాడు. కాని ఆ ఫిడేలు చాల విచిత్రంగా వుంది. గాజుతో కొత్త పద్ధతిలో తయారుచేసింది. దాన్ని

రెండు చేతులతో పట్టుకుని రొమ్ములను ఆనించుకుని వాయించాలి. దాని శబ్దాలు అత్యద్భుతంగా వున్నాయి. అలాంటి ధ్వనులు ఆల్బర్టు ఎన్నడూ వినలేదు. రొమ్ములకు హత్తుకుని వాయిస్తున్న కొలదీ ఫిడేలు బ్రహ్మానందంగా పలుకుతోంది. ఆల్బర్టు మహదానందంతో వాయిస్తున్నాడు. గోడలు, నీడలు ఆ భవనం యావత్తూ సంగీత తరంగాలలో కదిలిపోనారంభించింది. అంతట ఏదో అద్వితీయమైన వెలుగు వ్యాపిస్తోంది. కాని గాజు ఫిడేలు అవడంవల్ల చాల జాగ్రత్తగా, మెలకువగా వాయించాలి. లేకపోతే పగిలిపోతుంది. ఆల్బర్టు చాల జాగ్రత్తగా, అతిసున్నితంగా వాయించాడు. అలాంటి సంగీతం మరెవరూ, మరెప్పుడూ వినటానికి వీలులేనంత గొప్పగా వాయించాడు, అతనికి అలసటవస్తోంది. అంతలో దూరంనుంచి వచ్చిన ధ్వని అతని ఏకాగ్రతను భంగపరచింది. అది ఒక గంట మ్రోత ; కాని అది మాటలు పలికింది. అవును, నీవే పరిధులన్నీ దాటి అనంతంలోకి వెళ్ళిపో ! వారంతా నిన్ను అవమానించినా, నిందించినా నీవు అందరికంటె గొప్పవాడివి, ఆనందమయుడవు ! ఈ వాయిద్యాన్ని ఇంకెవరూ ఇలా వాయించలేరు.' అని పలుకులు వినిపించాయి.

ఈ మాటలు చాలా కొత్తవిగా, విచిత్రమైనవిగా, అయినా నూటికినూరుపాళ్ళు సత్యమైనవిగా తోచాయి ఆల్బర్టుకు. ఫిడేలు వాయించడం ఆపాడు. రెండుచేతులూ పైకెత్తి ఆకాశంలోకి చూచాడు ఏదో అద్భుతమైన సౌందర్యం అతన్ని

సాక్షాత్కరించింది. అనిర్వచనీయమైన ఆనందం కలిగింది. ప్లాట్ ఫారంమీద మనుషులెవ్వరూ లేకపోయినప్పటికీ, అందరికీ కనిపించేలా అతను తన రొమ్మువిరచి తలను నిటారుగా పైకెత్తి నిలబడ్డాడు. హఠాత్తుగా ఎవరిదో చెయ్యి అతని భుజాన్ని తాకింది. తలతిప్పి చూచాడు. ఒక స్త్రీ మసకమసక వెలుతురులో నిలబడివుంది. ఆమె దీన వదనయై అతనివంక విచారంగా చూచింది. వెంటనే తను చేస్తున్నది తప్పని భావించాడు అల్ బర్ట్. సిగ్గుపడ్డాడు. 'ఎక్కడికి?' అడిగాడు ఆల్ బర్టు. మళ్ళీ ఆమె అతనివంక దీనంగా చూచి విచారంగా తలదించుకుంది. ఆస్త్రీ ఆమెయే! అతను ప్రేమించినస్త్రీయే! ఆమె తప్ప మరెవరూ కాదు, అవే ఆభరణాలు, అవే దుస్తులు, తెల్లని మెడచుట్టూ ముత్యాలహారంవేసుకుంది. అద్భుతమైన చేతులు అవే. ఆమె అతని చెయ్యి పుచ్చుకుని హాలులోంచి అవతలికి తీసుకెళ్ళింది. 'బయిటికి వెళ్ళడానికి దోవ అవతలివైపునవుంది' అన్నాడు ఆల్ బర్టు. కాని ఆమె జవాబు చెప్పలేదు. మందహాసంచేస్తూ అతన్ని తనతో తీసికెళ్ళింది. హాలు వాకిలివద్దకు వచ్చేసరికి ఆల్ బర్టుకు చంద్రబింబము, నీరు అగిపించింది. కాని ఆ నీరు మామూలుగా పైన, గుండ్రంగా ఒక ప్రదేశంలో లేదు. చంద్రుడు, నీరుకూడా కలిసి అంతటా, పైన, క్రింద ప్రక్కల, ముందు, వెనుక, వారిద్దరిచుట్టూ వ్యాపించి వున్నట్లుగా తోచింది. ఆల్ బర్టు ఆమెతోపాటు, ఆ చంద్రకాంతిలో మిళితమైన నీళ్ళలో దుమికాడు. ప్రపంచంలో అన్నిటికంటే

మిన్నగా ప్రేమించిన తన ప్రేయసిని కౌగిలించుకున్నాడు. అని ర్వచనీయమైన ఆనందాన్ని పొందాడు. 'ఇది స్వప్నంకాదూ?' అనుకున్నా డతను తనలో. కాదు! ఇది నిజానికంటె నిజం! వాస్త వానికంటె వాస్తవం! వాస్తవం, స్మృతి; ఈ రెంటికలయిక' వెంటనే అతనికి అనిపించింది. ఆ క్షణంలో పొందిన అనిర్వాచ నీయమైన ఆనందం వెంటనే గతించిపోతున్నట్లూ మరెన్నటికీ తిరిగిరానట్లూ తోచింది. 'నేనెందుకు దుఃఖిస్తున్నాను?' ఆమెను ప్రశ్నించాడతను. ఆమె అతని వంక మౌనంగా, విచారంగా చూచింది. ఆమె అభిప్రాయమేమిటో ఆల్బర్టు గ్రహించాడు. దాని అర్థమేమిటో అతను తెలుసుకున్నాడు. 'నేను జీవించి ఉన్నంతవరకూ అదెలా సాధ్యమవుతుంది?' మళ్ళీ గద్గదస్వరంతో అడిగా డతను. జవాబు చెప్పకుండా నిశ్చలంగా ఆమె తన ముం దుకు చూచింది. 'ఇది చాలా భయంకరంగావుంది! నేను జీవించే ఉన్నానని ఆమెకెలా విశదపర్చాలి?' అనుకున్నా డతను భయంతో. 'ఓ! ఈశ్వరుడా! నేను జీవించే వున్నాను! నన్ను అర్థంచేసుకో!' అన్నాడతను రహస్యంగా, భయంతో గడగడవణికిపోతూ.

'అతను అందరిలోకి గొప్పవాడు! ఆనందమయుడు!' ఒకానొకవాణి చెపుతూనేవుంది. కాని ఏదో బలంగా, ఇంకా బలంగా ఆల్బర్టుమీద పడి అణచివేస్తూవుంది. అది ఆ చంద్ర బింబమా, నీరా, లేక ఆమె ఆలింగనమా, లేక ఆమె కన్నీళ్ళా? ఏమో? అతను ఎరుగడు. మొత్తానికి దానియొక్క అంత రార్థాన్ని విశదపరిచేశక్తి తనకు లేనట్లు, అదంతా గతించిపోతు న్నట్లుఅనిపించింది అతనికి.

ఇద్దరు వ్యక్తులు 'అన్నా' ఇంట్లోంచి వస్తూ వాకిలి గడప దగ్గర పడివున్న ఆల్‌బర్టును చూచారు. వారిలో ఒకడు లోపలికి వెళ్ళి 'అన్నా'తో చెప్పాడు.

'ఎంతదారుణం! ఒక మనిషిని ఇలా హింసించడం నీకు న్యాయంకాదు.' అన్నాడతను.

'ఓ! ఆల్‌బర్టా! అతను నన్ను వేధించి ప్రాణాలు తీస్తున్నాడు!' అంది ఆమె. 'అనుష్కా! అతన్ని తీసుకొచ్చి ఆ గదిలో ఎక్కడో పడుకోబెట్టు' అని చెప్పింది ఆమె తన పరిచారికతో.

'నేను జీవించే వున్నాను – నన్నెందుకు పూడ్చిపెడతారు?' వాళ్ళు లోపలికి మోసుకపోతూవుంటే ఆల్‌బర్టు స్పృహలేకుండా కలవరించాడు.

---



# టాల్‌స్టాయ్ సాహిత్యం

| | | |
|---|---|---|
| సమరము - శాంతి 3 భా॥ | నవల | 22.50 |
| నవజీవనం | " | 6.0 |
| విషాదగీతి | " | 1.00 |
| సంసారసుఖం | " | 1.00 |
| పెనుభూతం | " | 1.00 |
| హాద్‌జీ మురాద్ | " | 1.50 |
| జీవితము-మతము | వ్యాసాలు | 1.15 |
| వెలుగుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి | కథలు | 1.00 |
| మనిషికి ఎంతభూమి కావాలి? | " | 1.00 |
| దరిద్రంలోనే శాంతి | " | 1.00 |
| ఇవాన్ ఇలిచ్ మృతి | " | 1.00 |
| రవ్వంతనిప్పు-ఇల్లంతా కాలుస్తుంది | | 1.00 |
| ప్రేమవున్నచోట-దేవుడున్నాడు | " | 1.00 |
| చెప్పడం సులభం, చేయడం కష్టం | | 1.00 |
| కోడిగుడ్డంత గోధుమగింజ | " | 1.00 |
| పిచ్చివాని జ్ఞాపకాలు | " | 1.00 |
| శవచ్ఛవం | నాటకం | 1.60 |

వివరాలకు

**దేశికవితామండలి, విజయవాడ-2.**